

# మరణానంతరం

# జీవుని ప్రయాణం

## దేవయాన పితృయాన మార్గాలు








కర్త:
సూనన్నార్షి
(డా॥ కోదూరి సుబ్బారావు)



గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ




# మరణానంతరం జీవుని ప్రయాణం

## దేవయాన పితృయాన మార్గాలు



వైదిక సంస్కృతీ పునరుద్ధారకుడు :
**మహర్షి దయానంద సరస్వతి**

కర్త :
**సుమ్నార్థి**
(డా. కోడూరి సుబ్బారావు)

ప్రకాశకులు :
**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు**
ఆర్యసమాజము-వ్యాస్‌నగర్, మేడిబావి, వారాసిగూడ,
సికింద్రాబాద్ - 500 061.

గాయత్రీ గ్రంథమాల : 48

మరణానంతరం జీవుని ప్రయాణం

ప్రథమ ముద్రణ ప్రతులు : 1000



సృష్టిసంవత్సరము : 197, 29, 49, 112.
విక్రమాబ్దము : 2073.
కలియుగాబ్దము : 5112.
శ్రీ ఖర నామ సం॥ర యుగాది (2-4-2011)

**మూల్యము : రూ. 40=00.**

(తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. డా॥ కోడూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం (B.O.) ; (Via.) భువనగిరి - 508 116.
సెల్ : 9290604641.
2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, ఆర్యసమాజము,
12-10-586/6, వారాసిగూడ, సీతాఫలమండి,
సికింద్రాబాద్ - 500 061.
3. ఆర్యసమాజము, మెయిన్‌రోడ్డు, సీతాఫలమండి - 500 061.
4. శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం. 5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్.
ఫోన్ : 040-6632 0300.
5. శ్రీ విద్యా బుక్ డిపో మరియు గోపాల్ బుక్ హౌస్,
ఆర్యసమాజము ఎదురుగా, సుల్తాన్‌బజార్, హైదరాబాద్.
6. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
ఫోన్ : 08644-252789.

*Printed at :*

**PRINTSHOP** - 6632 0300.



# ప్రార్థన

ఋషిః వసిష్ఠః
ఛన్దః - విరాడ్ బ్రాహ్మీ త్రిష్టుప్

దేవతా - రుద్రః
స్వరః - ధైవతః

త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుకమివ బన్ధనాన్మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్ ॥
త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పతివేదనమ్ ।
ఉర్వారుకమివ బన్ధనాదితో ముక్షీయ మాముతః ॥

-యజుర్వేద (3-60)

త్రివిధ లోకాలలోను, మా త్రివిధ శరీరాలలోను వ్యాపించియున్న త్ర్యంబకేశ్వర ! పరమేశ్వర ! దోసపండు పక్వమై - సుగంధయుక్తమై తీగనుండి సునాయాసముగా విడిపోవునట్లు మేము నీ కృపచే నీ ఆజ్ఞాపాలకులమై సద్గుణ సుగంధయుక్తులమై ప్రాపంచిక మృత్యువులనుండి - కష్టాలనుండి, అకాల మృత్యువునుండి అనాయాసముగా విడిపోవుదుము గాక ! నీ అమృతత్త్వమునుండి మాత్రము మేము వేరుకాకుందుము గాక!

ఓ త్ర్యంబకేశ్వర ! నీ గురించిన శుద్ధమైన జ్ఞానమును మా కొసగి, నీ సద్గుణములతో మమ్ము సంయక్తులచేసి మిగలపండిన దోసపండువలె ప్రకృతిరూప తీగనుండి మమ్ము విడిపించుము. కాని, నీ తృతీయ ధామమునుండి (ముక్తిధామమునుండి) మమ్ము వేరుచేయవద్దు.

సుమ్నార్థి
(డా. కోదూరి సుబ్బారావు)



# మాతృదేవో భవ

(తల్లిని దేవతగా ఆదరించి సత్కరించుము)

## కీ॥శే॥ శ్రీమతి ఓరుగంటి వెంకట్రామమ్మగారి సంక్షిప్త పరిచయం

శ్రీమతి వెంకటరామమ్మగారు నల్లగొండ జిల్లా మిర్యాలగూడ తాలూకా రావులపెంట గ్రామంలో క్రీ.శ. 1915 ప్రాంతంలో జన్మించారు. వీరి తండ్రి శ్రీ గుండా దశరథరామయ్యగారు. తల్లి శ్రీమతి చక్రమ్మగారు. వీరికి శ్రీ అయోధ్యా రామయ్య, శ్రీ రంగయ్య అను ఇద్దరు అన్నలు ; శ్రీ నారాయణ, శ్రీ అంజయ్య అను ఇద్దరు తమ్ములు ఉన్నారు. వీరికి 1923 సం॥లో అదే గ్రామానికి చెందిన శ్రీ ఓరుగంటి రంగయ్య, రంగమ్మ గార్ల కుమారుడు శ్రీ లచ్చయ్య గారితో వివాహం జరిగింది. వివాహానంతరం క్రమంగా ఈ దంపతులకు కొన్ని స్వంత ఆస్తులు సమకూరాయి. పూర్వజన్మ సంస్కారాలవల్ల వీరిద్దరిలోను దాన ప్రవృత్తి మెండుగా ఉండేది. మిర్యాలగూడలో జరిగే అన్ని దాన ధర్మకార్యాలలోను ఈ దంపతులు ముందువరసలో ఉండేవారు. వీరివల్ల ఎన్నో బీద కుటుంబాలు ప్రయోజనం పొందాయి. 1962 సం॥లో చైనాతో యుద్ధం సంభవించినపుడు శ్రీమతి వెంకటరామమ్మగారు తన వంటిమీద నగలను దేశరక్షణ నిధికి విరాళంగా యిచ్చారు. ఆనాటి రాష్ట్ర న్యాయశాఖామంత్రి శ్రీ పి.వి. నర్సింహారావు గారికి వేసిన దండను పాటపాడి గెల్చుకున్నారు.

ఈ దంపతులు చాలా దాన ధర్మాలు చేశారు. వాటిలోకొన్ని -

1. మిర్యాలగూడలో ప్రసూతి దవాఖానాకు విద్యుత్ ఏర్పాటుచేశారు.

2. ప్రజల సౌకర్యంకోసం తుంగపాడు గ్రామంలో ధర్మశాల 3. మిర్యాలగూడ జూనియర్‌కాలేజ్‌ముందు ధర్మసత్రం, చేదుడు బావి నిర్మించారు. 4. గాంధీపార్కు స్కూలులో ఒక గది నిర్మించారు. 5. సరస్వతీ శిశుమందిరంలో పిల్లలకు

బల్లలు, కుర్చీలు చేయించారు. 6. శ్రీశైలం, బాసర, యాదగిరిగుట్ట, మఠంపల్లి అన్న సత్రాలకునూ ఇతోధికంగా సాయం చేశారు.

1933 సం॥లో మిర్యాలగూడ ఆర్యసమాజ స్థాపనలో ఈ దంపతులు క్రియాశీల పాత్రపోషించి అప్పటినుండి ఇప్పటి వరకు అండగా నిలచారు. 30 సంవ్సతరాల నుండి అవిరామముగా శ్రీ సర్వేశరరావు సంగీతం మాష్టరు గారి నేతృత్వంలో పిల్లలకు పాటల పోటీలు ఏర్పాటు చేయించి బహుమతులు ఇస్తూవచ్చారు.

వీరేగాక వీరి కుటుంబ సభ్యులందరిలోను ఇదే దాన ప్రవృత్తి సంస్కార రూపంలో ప్రవేశించింది. వీరి కుమారుడు శ్రీ వెంకటరంగయ్య, కోడలు శ్రీమతి లక్ష్మీదేవి గార్లు ఇరువురు సమాన గుణకర్మ స్వభావాలుగల ఆదర్శ ఆర్య దంపతులు. వీరిరువురు విస్తృతంగా వైదిక ధర్మ ప్రచారం చెయ్యటమేకాక పిల్లలను, పెద్దలను, కార్యకర్తలను అందరినీ ప్రోత్సహిస్తూ తాము దానంచేస్తూ, ఇతరులచే దానం చేయిస్తూ వైదిక ధర్మప్రచారానికి, గురుకులాలకు ఎంతగానో తోడ్పడుతున్నారు.

తమ సంతానమైన చి. విరజానంద్, చి. లక్ష్మణార్య, చి.సౌ. శ్రీదేవి లను మంచి సంస్కారవంతులుగా వైదిక ధర్మంపట్ల శ్రద్ధాభక్తులు కలవారుగా తీర్చిదిద్దారు. అదృష్టవశాత్తు కోడండ్రు శ్రీమతి ఉమారాణి, శ్రీమతి సుస్మిత గార్ల యందును మరియు అల్లుడు శ్రీ సుమన్ గార్లయందును మంచి సంస్కారాలు, సేవాభావం, దాన ప్రవృత్తి, వైదిక ధర్మంపై శ్రద్ధా భక్తులు కలిగినవి. ఇంతేగాక, మనుమరాండ్రు జూపూడి లక్ష్మీప్రియ, జాహ్నవి, ఓరుగంటి శ్రిత వీరును మంచి సంస్కారవంతులుగా తయారౌతున్నారు. ఆర్యసమాజ కార్యక్రమాలలో పాల్గొంటున్నారు.

1985 సం॥ నుండి వీరి గృహంలో నిత్యాగ్నిహోత్రం జరుగుచున్నది. విద్వాంసులు, పండితులు, ప్రచారకులు, కార్యకర్తలు అందరూ తరచుగా వీరి యింట ఆతిథ్యం పొందుతూవుంటారు. ఆశీస్సులు, శుభాకాంక్షలు ఇస్తూవుంటారు. ఇంట్లోని వారంతా అతిథియజ్ఞప్రియులే. కనుక వీరింటికి

వచ్చినవారంతా మధురమైన భోజనాదులతోను, పలకరింపులతోను తృప్తిచెందుతూవుంటారు.

కుటుంబాన్ని పైవిధంగా నిర్మాణం చేసిన గొప్ప సంస్కారవంతురాలైన శ్రీమతి వెంకటరామమ్మగారు వికృతినామం సం॥ర అధిక వైశాఖ అష్టమి (22-4-2010) దినమున ఉదయం గం॥ 7-10 ని॥లకు కుటుంబాన్నంతా దుఃఖసాగరంలో ముంచివేస్తూ పార్థివ శరీరాన్ని విడిచి పరమేశ్వరుని ఒడిలోకి చేరిపోయారు. ఆ సాయంత్రం 6 గంటలకు బంధుమిత్రుల, కార్యకర్తల, విద్వాంసుల సమక్షంలో వైదిక పద్ధతిన అంత్యేష్ఠి సంస్కారం ఘనంగా జరిగింది. వీరి ఆత్మకు శాంతి చేకూరి వీరికి ఉత్తమ జన్మలు, సద్గతి కలగవలెనని మేము భగవంతుని మనసారా ప్రార్థిస్తూన్నాము. వీరి కుటుంబ సభ్యులందరికి దుఃఖోపశమనం కలిగించి మరింత ఉత్సాహంగా వైదిక ధర్మానికి సేవ చెయ్యగల శక్తిని ప్రసాదించుమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

ఇట్లు

మీ ఆత్మబంధువులు

శింగిరికొండ లచ్చయ్య, కోటమ్మ

చారుగుండ్ల మల్లిఖార్జునరావు

గుంటూరు మంగమ్మ

మిర్యాలగూడ

22-4-2011

## నాయనమ్మతో మనుమని ఆత్మీయ అనుబంధం

నిందంతునీతిని పుణాయది వా స్తువంతు,
లక్ష్మీః సమావిశతు గచ్ఛతువాయథేష్టమ్
అద్యైవవామరణమస్తు యుగాంతరే వా,
న్యాయ్యాత్‌ఫథః ప్రవిచలన్తి పదంనధీరాః ॥ (భర్తృహరి నీతి శతకము)

భావార్థము : నీతి శాస్త్రకోవిదులునిందించినను పొగడినను, ధన కనక వస్తువాహనాది సంపదలు వచ్చినను రాకున్నను నేడే మరణము సమీపించినను ప్రళయమున కలిగినను, ధైర్యముగల బుద్ధిమంతులు న్యాయ మార్గమును ఎన్నడు విడువరు.

ఈ శ్లోకం మానానమ్మ జీవితానికి చాల దగ్గరగా ఉంటుంది. నానమ్మ ఎన్నడూ న్యాయమార్గాన్ని విడువలేదు. ఆన్యాయం ఆచరించలేదు. ధైర్యాన్ని కల్గి ఉండే ది ఎన్ని కష్టనష్టములు కలిగినా ధీరతను కల్గి ఉండేది. నానమ్మ జీవితంలో ఎన్నో మంచి పనులు చేసి మాతోచేయించి సంతృప్తి పొందేవారు. ప్రతిదినం మా ఇంట్లో అల్పాహారం మా నానమ్మకే పెట్టి తరువాత మేము తినేవారము నానమ్మను విడిచి ఉండలేక పోయేవాడిని. ఒక రోజు నానమ్మ మంచంపై నుండి క్రిందపడిపోయింది. నేను వెంటనే రెండు చేతులతో పట్టి మంచంపై కూర్చోబెట్టి దెబ్బ తగిలినదా ? అంటే నాకేం కాలేదు అన్నది కాని, భయపడలేదు. మా నానమ్మ ఎంతో ప్రేమతో పెంచింది మమ్ములను ఆమెకు మేము ఏంతసేవచేసినా, వారి ఋణం తీరదు. నానమ్మ ఆత్మకు శాంతి కలగాలని ఈశ్వరుని కోరుతున్నాను.

పెద్ద మనుమడు
**ఓరుగంటి విరజానంద సరస్వతి కుమార్**
మిర్యాలగూడ.

# నాయనమ్మతో మనవరాలి ఆత్మీయ అనుబంధం

మా నాయనమ్మతో నాకున్న అనుబంధం ఒక తల్లికి కూతురుకు మధ్య ఉండే అనుబంధం కన్న గొప్పది అనిపిస్తుంది. నా చిన్నపుడు మా అమ్మ నాన్నలు ఎక్కడికి వెళ్ళినా నేను మాత్రం మా నానమ్మతోనే ఉండి పోయేదాన్ని. అందువల్ల కూడా ఆమె అంటే నాకు ఎక్కువ మక్కువ. నాకు ఏ చిన్న అసౌకర్యం కలిగినా ఆరోగ్య సమస్యలు వచ్చినా తనకే వచ్చినంతగా బాధపడుతూ నాకు సపర్యలు చేసేవారు. అన్నింటికంటే ఎక్కువగా నాకు ఆమెలో నచ్చిన గుణము. మాచేత ఎన్నో మంచి పనులు చేయించేవారు. మొక్కలు నాటించడం, ఇతరులకు సహాయం చేయటం. దానధర్మములు చేయించటం వంటి ఎన్నో మంచి అలవాట్లను మాకు నేర్పించారు.

నాకు ఇష్టమైన అతి కొద్ది మందిలో మా నాయనమ్మ మొదటివారు. మృత్యుజంయ మంత్రంలో చెప్పినట్లుగా బాగా పండిన పండు చెట్టునుండి విడివడినట్లు నిండు జీవితాన్ని సమర్థవంతంగా ఆదర్శప్రాయంగా 96 సం॥ జీవించయిన ధన్యజీవి మా నాయినమ్మ ఓరుగంటి వెంకటరామమ్మ గారు, ఇంతటి మహోన్నతమైన వ్యక్తిత్వము కలిగి మాకు ఒక ఉన్నతమైన స్థాయి కల్గిన జీవితాన్ని మా కందించిన మా నాయినమ్మకు ఇదే నా శ్రద్ధాంజలి. మా నానమ్మగారి ఆత్మకు సద్గతి ప్రాప్తి కలగాలని దేవుని ప్రార్థిస్తున్నాను.

మనుమరాలు
జూపూడి శ్రీదేవి
(CA. U.S.A.)

## నాయనమ్మతో మనుమని ఆత్మీయ అనుబంధం

శతహస్త సమాహార సహస్తస్త సంకిర ।
కృతస్యకార్యస్య చేహస్ఫాతిం సమావహః (అథర్వ. 3-24-5)

"వంద చేతులతో సంపాదించి వేయి చేతులతో ధర్మకార్యాలు చేయుము" అనే వేదోక్తి. మా నానమ్మలో నూరు శాతం కనిపించింది. మా తాతగారు ఓరుగంటి లచ్చయ్య గారు మా నానమ్మ వెంకట్రామమ్మ గారి మనవడిగా నేను గర్విస్తాను. మా నానమ్మ తాతాయ్యగార్లు ఎంతో కష్టపడి ధర్మానుసారంగా ధనం సంపాదించి ఎన్నో పుణ్యకార్యాలు, విద్యాలయాలు, సత్రములు, బావులు, బీదలకు అన్న వస్త్రములు, వివాహములకు దానధర్మములు చేశారు. విద్వాంసులకు పండితులకు ప్రీతిగా భోజనం పెట్టి సేవ చేసేది. మా నానమ్మకు వైదికధర్మమంటే చాలా ప్రీతి. 70 డెబ్బది సంవత్సరాలుగా విగ్రహారాధన మానివేసి ఉదయం, సాయంత్రం సంధ్యావందనం చేసేవారు. 30 సం॥ ముప్పది సంవత్సరాలనుండి మా యింట్లో అగ్నిహోత్రం (యజ్ఞము) చేసే భాగ్యము నానామ్మ వల్లే కలిగినది.

తాను గురుకులానికి వెళ్లి ప్రతిజ్ఞ చేసి వచ్చి యింటిలో అగ్నిహోత్రం ప్రారంభించి మమ్ములందరిని అగ్నిహోత్రులుగా మార్చిన భాగ్యం నానమ్మదే. నా చిన్నపుడు అమ్మ కోపగించితే నన్ను బుజ్జగించి ఓదార్చేది. ఆ ఓదార్పులో నాకు ఎంతో ధైర్యం కలిగేది. **"త్యాగేనైకే అమృతత్వమశ్నుతే"** అన్న వేదోక్తికి నానమ్మ జీవితం ఉదాహరణ అనవచ్చు. ఏనాడు నాది అని ఏది దాచలేదు. నాకు కావాలని అనలేదు. ఎంతో త్యాగజీవి మానానమ్మ గారు.

ఎంత చెప్పినా, ఎంత వ్రాసినా, ఎంత చేసినా చాలా తక్కువే. మానానమ్మ ఋణం తీర్చుకోలేము. నానానమ్మ ఆత్మకు శాంతి కలగవలెనని సద్గతి కలగవలెనని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

చిన్న మనుమడు

**ఓరుగంటి లక్ష్మణార్య (U.S.A.)**

# తొలిపలుకులు - ధన్యవాదములు

అయిదు సంవత్సరాల క్రిందట 'ఆర్యజీవన్' (15-1-2006) పత్రికలో వారణాశి (కాశీ ) పాణినీ ఆర్ష కన్యా గురకుల విదుషీమణి - ఆచార్యా సుశ్రీ సూర్యాదేవీ చతుర్వేదా గారి హిందీవ్యాసం "వేదోంమే బతాయే జీవ కే బారహ్ (12) దిన్" వ్యాసం చదవటం జరిగింది. యజుర్వేదం 39వ అధ్యాయంలోని "సవితా ప్రథమే అహన్, అగ్నిర్ ద్వితీయే, వాయు స్తృతీయే ............ అనే మంత్రాన్ని దేవయాన మార్గంగా వివరిస్తూ మాతాజీ చాలా చక్కగా వ్యాఖ్యానం చేశారు. దానిని నేను అనువదించి పంపగా ఆర్యజీవన్ (Arya Jeevan) పత్రికలో ప్రచురించారు. అది చదివినకొందరు వ్యాసం చాలా బాగుంది. క్రొత్త విషయం కనుక మరికొంత వివరంగా వ్రాస్తే బాగుంటుందన్నారు. ఈ విషయంపై సీతాఫలమండి ఆర్యసమాజంలో ప్రసంగించటమూ జరిగింది.

ఇది యిలా ఉండగా మిర్యాలగూడ ఆర్యసమాజ విదుషీమణి శ్రీమతి ఓరుగంటి లక్ష్మీదేవి గారు వారి అత్తగారు మృతిచెందిన అనంతరం వారి భర్త శ్రీ రంగయ్య గారితో కలిసి భువనగిరి (హనుమాపురం) వైదిక వానప్రస్థ సాధకాశ్రమానికి శాంతినికోరుతూ రెండురోజులు మా మధ్య గడపటానికి వచ్చారు. అప్పటికే వారు వారి అత్తగారి స్మృతిలో 'మాతృగౌరవము' అనే పుస్తకాన్ని ముద్రించి వితరణ చెయ్యటం జరిగింది. అయినా మరియొక చిన్న పుస్తకం నాచేత వ్రాయించి వితరణ చెయ్యాలనే సంకల్పం వారికి కలిగింది. ఆ విషయం నాతో ప్రస్తావించగా ఈ పుస్తకాన్ని గురించి చెప్పాను. అందుకు ఆ ఆర్యదంపతులు సంతోషించి మరణానంతరం జీవుని గతిని గురించి అన్ని విషయాలు సంక్షిప్తంగా వచ్చేటట్టు వ్రాయమని ప్రోత్సహించారు. 500 ప్రతులకు ముందుగానే డబ్బు చెల్లించారు. ఈ పుస్తకాలను ప్రథమ వర్ధంతి సందర్భమున వితరణ చేస్తామన్నారు.

ఆదర్శ ఆర్యదంపతులు శ్రీమతి ఓరుగంటి లక్ష్మీదేవి శ్రీ వెంకట రంగయ్యగార్లతో నాకు చాలా కాలంగా పరిచయముంది. కామారెడ్డి ఆర్షగురుకులంలో నేను చాలా అనారోగ్యంతో ఉన్నప్పుడు నా గదికి వచ్చి చాలా పర్యాయాలు పలకరించి వెళ్ళటం జరిగింది. నా పుస్తకాలను గురించిన ప్రశంసయు చేసేవారు. అదీగాక, వారి ప్రచారశైలి నాకు నచ్చింది. ఆ దంపతులు ఏమాత్రం గర్వం లేకుండా ఎవరింటికి సంస్కారాలు, యజ్ఞాలు చేయించటానికి వెళ్ళినా, ప్రచారం కొరకు వెళ్ళినా ఆ యింటిలోని వారందరితో కలిసిపోయి వారి సంతానంగా ఆత్మీయ బంధువులుగా ఆయా కుటుంబాలకు చక్కటి ప్రేరణ కలిగిస్తారు. వైదిక ధర్మంపై శ్రద్ధను కలిగిస్తారు. ముఖ్యంగా ఆత్మికోన్నతికై వారిని స్వాధ్యాయం చెయ్యండనీ, నియమంగా సంధ్యాగ్నిహోత్రాలు చెయ్యండనీ, గాయత్రీ జపం, ఓంకార ధ్యానం చెయ్యండని ప్రోత్సహిస్తారు. వాటిని వ్రతంగా స్వీకరించండనియు

బలవంతం చేస్తారు. ఆ విధంగా వారు ఎన్నో కుటుంబాలను వైదిక ధర్మీయులుగా ఆర్యసమాజికులుగా మార్చారు. ఈ విధమైన ప్రచారమే నేడు అవసరం.

ఇంతేగాక, లక్ష్మీదేవి గారు నా వలె చదువుకున్న తరగతులు తక్కువే అయినా స్వాధ్యాయం చేసి, విద్వాంసుల ప్రవచనాలు విని, విద్వాంసులకు సేవలుచేసి వారి ఆశీస్సులు, హితోపదేశాలు పొంది చక్కటి జ్ఞానవంతులయ్యారు. చక్కగా ఉపన్యసించగల నేర్పును సంపాదించారు. ఉపనిషత్తులను చదివి వినిపిస్తూ వివరించి చెప్పగల విద్వత్తతను పొందారు. వారు రెండు గంటలు ప్రవచించినా శ్రోతలు విసిగిపోక పోగా మరికొంత సేపు చెప్పండని కోరటం నేను స్వయంగా చూశాను. ఇంత ఉన్నతిపొందినా ఏమాత్రం గర్వం లేకుండా సామాన్య కార్యకర్తలుగా అందరితో కలిసిపోవటం నాకు అన్నిటికన్న బాగా నచ్చింది. అందుచే వారి కోరికమేరకు ఈ చిన్న పుస్తకం వ్రాయటం జరిగింది.

ఈ పుస్తకం వ్రాయబోయేముందు జీవుని గతిని గురించి వేరే విద్వాంసుల అభిప్రాయాలను చదివిచూశాను. వాటిలో కీ.శే. పం. సత్యవ్రత సిద్ధాంతాలంకార్ గారి రచన 'సంస్కార సముచ్చయం'లోని అంత్యేష్టి సంస్కార వివేచనభాగం నాకు బాగా నచ్చింది. క్రైస్తవ మహ్మదీయ పారశీకాది మతముల వారి అభిప్రాయాలన్నీ ఆ గ్రంథం నుండే స్వీకరించాను. ఆ విధంగా ఈ చిన్న గ్రంథం తయారయ్యింది.

ఈ రచనకు నన్ను ప్రోత్సహించి 500 ప్రతులకు ముందుగానే మూల్యం చెల్లించిన శ్రీమతి ఓరుగంటి లక్ష్మీదేవి శ్రీ వెంకటరంగయ్య దంపతులకు నా హృదయపూర్వక ధన్యవాదములు. జాగ్రత్తగా కంపోజింగ్ చేసిన శ్రీ చకిలం వినోద్ కుమార్ గారికి, అందంగా ముద్రించి యిచ్చిన ప్రింట్‌షాప్ యజమానలకు కార్యకర్తలకు, మరియు ప్రూఫ్‌లు అందించటంలో సహకరించిన వారికి నా శుభాకాంక్షలు.

పరమేశ్వరుని అనుగ్రహం వల్ల ఆరోగ్యం కొంత అనుకూలించి ఎట్లో కొన్ని చిన్న పుస్తకాలు వ్రాయగలుగుతున్నానుకాని ప్రూఫ్‌లు దిద్దటం చాలా భారమౌతున్నది. కన్నులు అలసిపోవటమే కాక ఛాతీయు నొప్పిగా ఉంటున్నది. ఈ మధ్య నేను సీతాఫలమండిలో 10 దినములు ఉండవలసి వచ్చుటచే ఈ పుస్తక మొదటి ప్రూఫ్ దిద్దటంలో శ్రీ దేశబోయిన జైరాజ్ గారు కొంత సహకరించారు. వారికినీ క్షణం తీరికలేదు. ఎంత జాగ్రత్తగా చూసినా కొన్ని తప్పులు మిగిలిపోతూనే ఉన్నాయి. కనుక పాఠకులు మా యిబ్బందులను సహృదయతతో మన్నించి తప్పులు ఒప్పులుగా మార్చుకొని చదువుకోగోరుచున్నాను.

మీ సేవలో

సుమ్నార్థి

(డా. కోదూరి సుబ్బారావు)

వైదిక వానప్రస్థాశ్రమం,
హనుమాపురం, భువనగిరి,
వికృతి మాఘ శు॥ పౌర్ణిమ.

# ఈ 'జీవుని ప్రయాణం'లో .......



చదవండి – ఆలోచించండి

సత్యాన్ని అనుసరిస్తూ ప్రచారం చేయ్యండి



# మరణానంతరం
# జీవుని ప్రయాణం

ప్రపంచ దేశాలను పరిశీలించి చూస్తే మరణానంతర ప్రక్రియలు పలురకాలుగా కనబడతాయి. చాలా దేశాల (తెగల) అభిప్రాయమేమంటే- శరీరం మరణించినా దానితో జీవుని సంబంధం పూర్తిగా తెగిపోదనీ, ఏదో అదృశ్యరూప సంబంధం ఉంటుందనీ వారి నమ్మకం. ఒకవేళ జీవుడు మరొక లోకానికి వెళ్ళినా మృతశరీరంతో కొంత సంబంధాన్ని కలిగివుంటాడని కొందరంటారు. అందుచేతనే వారు ఆ మృతశరీరాన్ని జాగ్రత్తపెట్టడానికి ప్రయత్నిస్తారు. భూస్థాపితం చేసి సమాధులు కడతారు. కొన్ని తెగలవారు మరణించిన వ్యక్తికి ప్రియమైన లేదా అతనికి అవసరమైన వస్తువులనుకూడా శవంతో కలిపి పూడ్చిపెడతారు. కాలాంతరంలో ఆ వస్తువులు ఆ జీవున కవసరం కావచ్చునని వారి నమ్మకం. బల్గేరియా దేశంలో శవాన్ని పూడ్చి దానిపై సమాధి కట్టేటప్పుడు ఒక రంధ్రాన్ని ఏర్పాటు చేస్తారు. అప్పుడప్పుడు ఆ రంధ్రం గుండా ఆహారపానీయాల నందజేయుటకంట ఆ ఏర్పాటు.

బోలీలియా దేశంలోని లాపెజ్ వాసులకు ఒక వింత నమ్మకముంది. వారు ప్రతీ మనిషికి ఏడు ఆత్మలుంటాయంటారు. చనిపోయిన తరువాత అందులోని ఆరు ఆత్మలు స్వర్గానికి వెళ్ళిపోతాయనీ, ఒకటి మాత్రం పుర్రెలోనే ఉంటుందని వారి నమ్మకం. అందుకని లాపెజ్ వాసులు శవాన్ని పూడ్చిపెట్టిన తరువాత కొన్నాళ్ళకు అక్కడకు వెళ్ళి త్రవ్వి శవంయొక్క పుర్రెను తీసుకువచ్చి యింట్లో పెట్టుకుని పూజిస్తారు. అలాచేస్తే వారి కుటుంబం సుఖ సంతోషాలతో ఉంటుందని వారి నమ్మకం. ఏమాత్రం నిర్లక్ష్యం చేసినా చెడు జరుగుతుందట.

ఏడాదికొకసారి అందరి యిళ్ళలోని పుర్రెలను ఊరేగింపుగా ఒక చోటికి చేరుస్తారు. అక్కడ పుర్రెలచే సిగరెట్లు కాల్పిస్తారు, సారా త్రాగిస్తారు.

ప్రాచీన ఈజిప్టు దేశీయులు మృత శరీరానికి కొన్ని ఓషధులు, రసాయనాలు పూసి మమ్మీగా తయారుచేసేవారట. రాజులు మరణిస్తే ఆ రాజు భార్యలను, సేవకులను, అతడు వాడే విలాస వస్తువులను ఆ శవంతో చేర్చి దానిపై పిరమిడ్లు కట్టేవారట. శరీరం మరణించినా దానిలోని జీవుడు వాటిని ఉపయోగించుకుంటూ ఆనందంగా గడుపుతాడని వారి నమ్మకం. ఇది మూఢనమ్మకమే అయినా వారు నిర్మించిన పిరమిడ్లు ఒక అద్భుతమైన వైజ్ఞానిక ఆవిష్కరణ. వారు భౌతిక శాస్త్రంలో (ఫిజిక్స్‌లో) గొప్ప పరిశోధనే చేశారనవచ్చు.

## క్రైస్తవుల నమ్మకం

నేడు ప్రపంచంలో విస్తృతంగా వ్యాపించియున్న మతం క్రైస్తవమతం. ఈ మతానికి మూలం యహూదీయులే. యహూదీయులు మృతశరీరాన్ని భూమిలో పాతిపెడతారు. ఆ పద్ధతి ననుసరించియే ఏసు శిలువపై మరణించినపుడు ఒక కొండపై ఆ శరీరాన్ని ఖననం చెయ్యటం జరిగింది. మూడవ దినమున ఏసు జీవితుడై ఆ సమాధినుండి బయటకు వచ్చాడనీ, కొందరిని కలిసి దేవుని దగ్గరకు వెళ్ళిపోయాడనీ అతని అనుయాయులు నమ్ముతారు. ఆయన బోధనల ననుసరించి ఏర్పడిన క్రైస్తవ మతంలోనూ యహూదీయుల శవఖనన ప్రథ వచ్చింది. వారునూ ఇప్పుడు శవాలను భూమిలో పూడ్చిపెడుతున్నారు.

క్రైస్తవుల విశ్వాసమేమంటే- మరణానంతరం శవాలను జాగ్రత్తగా భద్రమైన పెట్టెలలోపెట్టి పూడ్చిపెడితే ఆ జీవులు ఆ సమాధులలో సృష్టి ముగింపు సమయం వరకు సుఖంగా విశ్రాంతి తీసుకుంటారట. సృష్టిముగింపు సమయంలో నాల్గవ ఆకాశం నుండి యహోవా దేవుడు భూమిపైకి దిగివస్తాడట. అతని వెంట ఏసుక్రీస్తుకూడా దిగివచ్చి దేవుని కుడివైపు కూర్చుంటాడట. అప్పుడు ఎంతోకాలంగా సమాధులలో విశ్రాంతిగా గడుపుతున్న జీవులందరూ సమాధులనుండి లేచి బయటకు వస్తారట. అనంతరం న్యాయనిర్ణయం

జరుగుతుంది. ఆ న్యాయం వారి వారి కర్మలను బట్టికాక వారి వారి విశ్వాసాలను బట్టి ఉంటుంది. ఏసుక్రీస్తును దేవుని కుమారుడిగా అంగీకరించి అతనిపై విశ్వాసముంచిన వారినందరినీ స్వర్గానికీ, అట్టి విశ్వాసం లేనివారి నందరినీ నరకానికీ పంపిస్తాడు. స్వర్గానికి పంపబడినవారు శాశ్వతంగా స్వర్గంలోను, నరకానికి పంపబడినవారు శాశ్వతంగా నరకంలోను ఉండిపోతారు. కనుక క్రీస్తును విశ్వసించుమని వారి ప్రచారం. ఆ న్యాయనిర్ణయ దినాన్ని వారు Resurrection Day అంటారు. కొందరు 'జడ్జిమెంట్ డే' అంటారు. ఆ దినం వరకు జీవుడు ఆ మృతశరీరాన్నే అంటిపెట్టుకుని ఉంటాడు. కనుక శవాన్ని భద్రంగా పూడ్చిపెట్టాలంటారు క్రైస్తవులు.

## మహ్మదీయుల నమ్మకం

మహ్మదీయులునూ చాలావరకు ఇదే నమ్మకంతో శవాలను ఖననం చేస్తారు. వీరు సృష్టి అంతిమ దినాన్ని 'కయామత్' దినమంటారు. ఇంకా వీరేమంటారంటే–కయామత్ దినం వచ్చినపుడు 'సుర' అనే పేరుగల ఒక బాకా ఊదబడుతుంది. అప్పుడు శవాలను ఖననంచేసి కట్టిన సమాధులన్నీ వాటంతట అవే తెరచుకుంటాయి. వాటిలోని జీవులన్నీ బయటకు వస్తాయి. ఏ జీవులు స్వర్గానికి (జన్నత్‌కు) వెళ్ళాలో, ఏ జీవులు నరకానికి (దోజఖ్‌కి) వెళ్ళాలో ఆ రోజునే నిర్ణయింపబడుతుంది. ఆ దినం బాకా ఊదినపుడు అప్పటికి జీవించియున్నవారు కూడా చనిపోతారట. అన్ని మృతశరీరాలనుండి వెడలిన జీవులకును అదే రోజున న్యాయ నిర్ణయం జరుగుతుంది.

క్రైస్తవ మహ్మదీయ ధర్మగ్రంథాల ప్రకారం ఈ సృష్టి ప్రారంభింపబడి కొన్ని వేల సంవత్సరాలు మాత్రమే. (భారతీయ సృష్టికాల గణన చాలా పెద్దది. ఇప్పుడు సప్తమ వైవస్వత మన్వంతరంలోని 28వ కలియుగం జరుగుతోంది. వీటిని అంకెలలోనికి మారిస్తే 196 కోట్ల సంవత్సరాలకు పైగానే ఉంటుంది). వారి కాలగణన ప్రకారమైనా భూమిలో పాతిపెట్టబడిన శవం వేల సంవత్సరాలవరకు మట్టిలో కలిసిపోకుండా ఉంటుందా ? ఇదే ప్రశ్నను కురాన్‌ను ఆంగ్లభాషలోనికి అనువదించిన డా. సెల్ అనే వ్యక్తి తన గ్రంథంలో

ప్రశ్నించుకొని సమాధానం వెతకటం కోసం ప్రయత్నించాడు. ఈ ప్రశ్నకు సమాధానం హజరత్ మహ్మద్ బోధనలలో ఒకచోట కనబడిందట. శరీరమంతా మట్టిగా మారిపోయినా వెన్నెముక చివరిలోని వాలభాగం O.S. Coccygis చివరి వెన్నుపూస మిగిలి ఉంటుందట. దానికి వారు పెట్టిన పేరు 'అల్ అజ్బ' ఇస్లామ్‌లోని ఈ ఆలోచన కూడా యహూదీ మతం నుండి వచ్చినదే. యహూదీయులు సృష్టిఅంతంవరకు ఉండే ఈ ఎముకకు (LUZ) అని పేరుపెట్టారు. కయామత్ దినం ముందు 40 రోజులవరకు ఎడతెరిపిలేని పెద్ద వర్షం పడుతుందట. దానితో విత్తనాలు నాని మొలకెత్తినట్టుగా 'అల్ అజ్బ' ఎముకలన్నిటి నుండి జీవులు పుట్టుకువస్తాయని యహూదీ ధర్మగ్రంథాలు చెబుతాయి.

ఇస్లామ్ మతానుసారం శవాలను కిబ్లా (మక్కాశరీఫ్) వైపు తల ఉంచి ఖననం చెయ్యాలి. సమాధి కొద్ది పెద్దదిగా కట్టాలి. అవసరాన్ని బట్టి శవం లేచికూర్చున్నా సరిపోయేటట్టు ఉండాలి. సమాధిలో 'మునకిర్' మరియు 'నకీర్' అనబడే ఇద్దరు దేవదూతలు శవాని కిరువైపులా కూర్చొని అతని మంచి చెడు కర్మలను సూక్ష్మంగా పరిశీలిస్తారు. ఆ కర్మలనుబట్టి వారిని స్వర్గానికికానీ నరకానికికానీ పంపిస్తారు. సృష్టి అంతిమ దినాన యివన్నీ చేయవలసి ఉంటుందని శవాలను జాగ్రత్తగా పాతిపెట్టి సమాధులు కడతారు.

## పారశీకుల నమ్మకం

పారశీకులు శవాలను పూడ్చిపెట్టడంగాని, దహనం చెయ్యడంగాని చెయ్యరు. వారు శవాలను ఒక ప్రత్యేక ఎత్తైన ప్రదేశంలో నగ్నంగా వదలిపెట్టి వచ్చేస్తారు. మనిషి జీవించినంతకాలం పరులకు ఉపకారం చెయ్యాలన్నట్లే చనిపోయిన తదుపరి కూడా ఆ శరీరం కొన్ని మాంసాహార పక్షులకు ఉపయోగపడాలనేది వారి సిద్ధాంతం. వారి నిర్దేశిత ప్రదేశాలలో అలవాటుపడిన పెద్ద పెద్ద గ్రద్ధలు గుంపులు గుంపులుగా చేరతాయి. ఒకటి రెండు గంటలలోనే మెత్తటి మాంసభాగాన్నంతా తినివేస్తాయి. ఎముకలగూడుమాత్రం మిగులుతుంది. ఆ ప్రదేశంలో చాలా శవాలను వెయ్యటం వల్ల ఎముకలగూళ్ళు

గుట్టలు గుట్టలుగా పేరుకుపోతాయి. అందుచే అప్పుడప్పుడు వాటిని క్రిందఉన్న పాడుపడిన బావులలో పడవేస్తారు. లేదా మరొక పద్ధతిలో తొలగిస్తారు. వీరిలో శవాలను తీసుకు వెళ్ళేవారిని 'నాసాసాలార్' అంటారు.

బొంబాయి నగరంలో పార్శీశవ ప్రదేశాన్ని 'టవర్ ఆఫ్ సైలెన్స్' అంటారు. హైదరాబాద్‌లోను, సికింద్రాబాద్‌లోను యిట్టి ప్రదేశాలున్నాయి. సికింద్రాబాద్‌లో ఉన్నదానిని 'పార్శీగుట్ట' అంటారు. ఈ పద్ధతికూడా అంత మంచిది కాదు. గ్రద్ధలు ఎంత తిన్నా ఎముకలనంటి కొంత మాంసం ఉండిపోతుంది. అది క్రుళ్ళి దుర్గంధం గాలిలో వ్యాపిస్తుంది. అప్పుడప్పుడు గ్రద్ధలు కొన్ని ఎముకలు, కంకాళాలు ఎత్తుకుపోయి చుట్టు ప్రక్కల జనసంచారాలలో పడవేయటం, పిల్లలు భయపడటం జరుగుతూ ఉంటుంది.

## వేద సందేశం - వేద సిద్ధాంతం

భారతీయుల ధర్మగ్రంథం వేదం. అది ఈశ్వరీయ జ్ఞానం. పరమేశ్వరుని నుండి మానవులకు లభించిన ఆదిమజ్ఞానం. ఆదిమానవసృష్టి సమయంలోనే సృష్టికర్తయైన పరమేశ్వరుడు ఈ జ్ఞానాన్ని ఆదిమానవులలో యోగ్యులైన ఋషుల హృదయాలలో (బుద్ధిలో) ప్రకాశపరచాడు. దానిలో మానవులకు అవసరమైన విద్యలన్నీ బీజరూపంలో ఉన్నాయి. వేదమంతా ఒకటే అయినా విషయ విభాగాన్నిబట్టి, ఛందస్సులను బట్టి అది నాలుగుగా విభజింపబడి వ్యవహరింపబడుతోంది. అవే ఋక్ యజుస్సామ అథర్వములు. ఇచట 'వేదం' అనే ఏకవచన ప్రయోగం 'నాలుగు వేదాలు కలిసి' అని.

ఏ కర్మలు చేయతగినవో, ఏ కర్మలు చేయకూడనివో, ఏ కర్మలు చేస్తే మానవులకు ఉన్నతి కలుగుతుందో వేదం హేతుబద్ధంగా వివరించి చెబుతుంది. కర్మకాండను తెలిపే యజుర్వేదం అవసానకాలంలో ఏమి జరుగుతుందో, అప్పుడు జీవుడు ఏమి చెయ్యాలో, మరణానంతరం మృతశరీరాన్ని ఏమి చెయ్యాలో ఈ క్రింది మంత్రంలో వివరిస్తుంది.

**మం. వాయు రనిల మమృతమ్, అథేదం భస్మాంతం శరీరమ్ ।**

**ఓ3మ్ క్రతో స్మర, క్లిబే స్మర, కృతం స్మర ॥** (యజుర్వేదం (40-15)

సృష్టికర్త సందేశం :

ఓ మానవులారా ! దేహత్యాగ సమయంలో శరీరస్థ వాయువులు కారణరూప బాహ్యవాయువులలో కలిసిపోతాయి. శరీరం చేష్టారహితమైపోతుంది. కనుక, ఆ సమయంలో జీవులైన మీరు పరమేశ్వరుడినైన నన్ను నా ప్రధానమైన 'ఓ3మ్' నామముతో స్మరించాలి. ఆత్మబలం కొరకు నన్ను స్మరించాలి. ఆ శరీరంతో చేసిన శుభాశుభకర్మలను స్మరించి పాపకర్మలకు పశ్చాత్తాపపడాలి. మృత శరీరాన్ని భస్మంగా అంతం చెయ్యాలి. అంటే భస్మమయ్యేటట్లు దహించాలి.

పై వేద సిద్ధాంతం ప్రకారం జీవుడు మృతశరీరాన్ని పూర్తిగా వదలి వెళ్ళిపోతాడు. మరల ఆ శరీరంతో గానీ, బంధువులతో గానీ, ఎట్టి సంబంధాన్ని పెట్టుకోడు. ఆ జీవుని శుభాశుభకర్మలనుబట్టి పరమేశ్వరుడు అతనికి మరొక శరీరాన్ని నిర్మించియిస్తాడు. మరొక తల్లి గర్భంలో ఆ జీవుని ప్రవేశపెడతాడు. అతనికి కావలసిన ఆహార పానీయాది వ్యవస్థ ఆ పరివారంలోనే ఏర్పాటు చేస్తాడు.

ఇంతేగాక, మృతశరీరం వెంటనే క్రుళ్ళటం ప్రారంభమౌతుంది. 1, 2 రోజులకే విపరీతమైన దుర్గంధం తయారౌతుంది. అట్టి క్రుళ్ళిపోయిన శరీరంతో జీవుడు ఎలా సంబంధం పెట్టుకోగలడు ? సంబంధం పెట్టుకుంటే జీవునికి కలిగే ప్రయోజన మేమిటి ? వివేకవంతులు ఆలోచించవలసి ఉంది. శవాన్ని ఖననం చెయ్యాలంటే కనీసం 6 అడుగుల పొడవు, 3 అడుగుల వెడల్పు గల స్థలం కావాలి. చనిపోయిన ప్రతీ వ్యక్తికి యింత స్థలం కేటాయించవలసివస్తుంది. అలా చేస్తూ పోతే కాలాంతరంలో బ్రతికిఉన్నవారు నివసించటానికి స్థలం సరిపోతుందా ? రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో ఈ ప్రశ్నలు యూరోప్‌లోనూ ఉదయించాయి.

## యూరోప్‌లో శవదహన చరిత్ర

ఒకానొకప్పుడు యూరోప్ అంతా రోమనుల అధిపత్యంలో ఉండేది. ఆ సమయంలో రోమనులలోని ఉన్నతవర్గంవారు మరణిస్తే పాతిపెట్టేవారుకాదు.

దహనం చేసేవారు. వాళ్ళనిచూసి కొందరు యూరోపియనులు శవాలను దహనం చెయ్యటం ప్రారంభించారు. రోమనులకు ఈ సదాచారం గ్రీకులనుండి వచ్చింది. గ్రీకులు ఈ సదాచారాన్ని మన భారత్‌నుండి నేర్చుకున్నారు. పైథాగరస్ అనే పేరుగల ఒక గ్రీకు దార్శనికుడు మన వేదశాస్త్రాలపట్ల ప్రభావితుడై మన దేశానికి వచ్చి కొంతకాలం యిక్కడ గడిపాడు. అప్పుడు అతడు ఇక్కడి కొన్ని ఆచారాలను వివేచించి తెలుసుకొని వాటిని యూరోప్‌లో ప్రవేశపెట్టాడు. అట్లే, ప్లేటో అనే పేరుగల దార్శనికుడును మన ఆలోచనలతో ప్రభావితుడై కొన్నిటిని స్వీకరించాడు. ఈ విధంగా ఈ శవదహన ప్రక్రియ భారత్‌నుండి గ్రీసుకు, గ్రీసునుండి రోమ్‌కు, రోమునుండి యూరోప్‌లోను ప్రవేశించింది.

అనంతరకాలంలో క్రైస్తవమత ప్రచారం యూరోప్‌లో విస్తృతంగా జరిగింది. దానితో శవాన్ని దహనం చేస్తే అంతిమ దినాన ( Resurrection Day నాడు) ఏ శరీరంతో బయటకు వస్తాడు ? స్వర్గ నరకాలను ఏ శరీరంతో అనుభవిస్తాడు ? అనే ఆలోచనలు ప్రారంభమయ్యాయి. దానితో శవ దహనాన్ని వ్యతిరేకించటం ప్రారంభించారు. అయినా చాలా దేశాలలో శవదహనాలు జరుగుతూనే ఉండేవి. తూర్పు దేశాలలో ఒక్క చైనా దేశంలో తక్క మిగిలిన దేశాలలో నిరాటంకంగా శవదహన ప్రక్రియ జరుగుతూనే ఉండేది. చైనీయుడు ఎక్కడ మరణించినా చైనాకు తీసుకువచ్చి అక్కడనే పాతిపెట్టాలని వారి గట్టి వాదనగా ఉండేది. ఇప్పుడు చైనాలోనూ శవాలను దహించే ప్రథ (ఆచారం) వ్యాపిస్తున్నది.

క్రీ.శ. 1873 వరకు ఇంగ్లాండ్‌లో శవాలను పాతిపెడుతూనే ఉండేవారు. 1874 నుండి మేధావుల ఆలోచనా సరళిలో కొంతమార్పు వచ్చింది. ఆ సమయంలో విక్టోరియా మహారాణికి డా. హెన్రీ థాంప్సన్ అనే మేధావి సర్జన్‌గా ఉండేవాడు. ఆయన ఒకసారి వయానాలో ఒక ఎగ్జిబిషన్ చూడటం జరిగింది. అక్కడ అనేక పారిశ్రామిక ఉత్పత్తులతోబాటు శవదహనబట్టీని ఒకటి చూడటం జరిగింది. ఇటలీలో అక్కడక్కడ ఇటువంటి బట్టీలున్నాయనీ, ఆ విధంగా శవాలను పరిష్కరించటమే ఉత్తమమైన పద్ధతనీ విన్నాడు. ఇంగ్లాండులోనూ యిటువంటి శ్మశానవాటికలను ప్రారంభిస్తే బాగుండుననే

ఆలోచన అతనికి కలిగింది. ఈ విషయం తనతోటి వైద్య మిత్రులలో ప్రచారం చేసి 13-1-1874 తేదీ నాడు "క్రిమేషన్ సోసైటి ఆఫ్ ఇంగ్లాండ్' అనే పేరుతో ఒక సంస్థను స్థాపించాడు. శవదహన ఆవశ్యకతను తెలుపుతూ 'క్రిమేషన్ - ద ట్రీట్‌మెంట్ ఆఫ్ ద బాడీ ఆఫ్ ద డెత్' అనే పేరుతో ఒక పుస్తకాన్ని వ్రాసి ప్రచురించి వితరణ చేశాడు.

డా. హెన్రీ థామ్సన్ చేసిన ఈ ప్రయత్నాన్ని క్రైస్తవ సంఘాలు చాలా వ్యతిరేకించాయి. శవాన్ని దహించివేస్తే Resurrection రోజున సమాధులలో ఉన్న జీవులెలా బయటికి వస్తారు? జీవులు శరీరం లేకుండా స్వర్గ నరకాలలోని భోగాలనెలా అనుభవిస్తారు ? అనే పెద్ద ప్రశ్నలు ఎదురయ్యాయి. దానితో శవదహన బట్టీని నిర్మించటానికి చాలా కాలంవరకు ఇంగ్లాండులో స్థలమే దొరకలేదు. చాలా ప్రయత్నించగా చివరకు 4 సంవత్సరాల తరువాత వోకింగ్ ప్రాంతంలో కొంత స్థలం దొరికింది. ఎట్లో బట్టీని నిర్మించారు. కాని, చర్చికి భయపడి ఎవరూ శవాలను దహించటానికి ముందుకు రాలేదు. 1883లో డా. విలియమ్ ప్రైస్ అనే వివేకవంతుడైన వైద్యుడు వ్యాధి కారణంగా తన పిల్లవాడు ఒకడు చనిపోతే ఆ బాలుని ఈ బట్టీకి తీసుకువెళ్ళి దహనం చేయించాడు. వెంటనే క్రైస్తవ సంఘాలు కోర్టులో కేసువేశాయి. చాలా కాలం వాదోపవాదాలు విన్న తరువాత న్యాయస్థానం 'శవాన్ని దహనం చెయ్యటం నేరం కాదు' అని కేసును కొట్టివేసింది. దానితో వివేకవంతులు క్రమంగా శవాలను దహనం చెయ్యటం ప్రారంభించారు.

మొట్టమొదటగా కీ.శ. 1902లో ఇంగ్లాండ్‌లో శవదహన చట్టం (క్రిమేషన్ అక్ట్) పాసయ్యింది. అయినా చాలా కొద్దిమంది మాత్రమే శవాలను దహించటానికి ముందుకు వచ్చేవారు. రెండవ ప్రపంచయుద్ధ సమయంలో మరణించే వారి సంఖ్య బాగా పెరిగిపోయింది. వారిని పూడ్చిపెట్టడం పెద్ద సమస్యగా మారింది. పెద్ద పెద్ద గోతులుతీసి ఒక శవపేటికపైన మరొక శవపేటిక పెడుతూ మధ్యలో కొంత మట్టిపోస్తూ అంతస్థులుగా పూడ్చిపెట్టారు. అయినా సమస్య కష్టంగానే ఉండేది. దానితో శవదహన బట్టీలు నిర్మించి దహించటం తప్పలేదు. క్రమంగా 20వ శతాబ్దపు చివరికి లక్షల సంఖ్యలో

శవదహనాలు జరిగాయి. 2000 సంవత్సరం నాటికి ఇంగ్లాండ్‌లో 190 శవదహన బట్టీలు ఏర్పడ్డాయట. ఇంగ్లాండ్‌ను చూసి ఇతరదేశాల వారునూ వారిని అనుకరిస్తూ శవాలను దహనం చెయ్యటానికి అలవాటు పడ్డారు. దూరంగా ఉన్న స్కాండేవియన్ దేశాలలోనూ, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్‌లలోనూ ఈ ప్రథ వ్యాపించింది.

అమెరికాలో ఇంగ్లాండ్‌కన్న ముందే 1876లో "క్రిమేషన్ అసోసియేషన్ ఆఫ్ అమెరికా" ఏర్పడింది. అనతికాలంలోనే అమెరికా దేశాలన్నీ శవదహనాన్ని ప్రోత్సహించాయి. 1970 నాటికి బట్టీల సంఖ్య 88,000 వరకు పెరిగింది. క్రమంగా రాష్ట్రీయ శవదహన సంఘాలు, అంతర్ రాష్ట్రీయ శవదహన సంఘాలు ఏర్పడి విరివిగా ప్రచారం జరుగుతోంది. నిజంగా శవాలను పూడ్చిపెట్టడం వల్ల చాలా అనర్థాలు జరుగుతున్నాయి. జలవాయువులు కలుషితం కావటమేకాక ఎంతో భూమి వ్యర్థం అవుతోంది. ఎన్నో మూఢనమ్మకాలు దురాచారాలు ప్రబలుతున్నాయి. సమాధుల దర్గాల గోరీల పూజలు, వాటి పేరుతో మాదకద్రవ్యాల వినియోగాలు, జంతుబలులు, ఉద్రేకాలు, వర్గపోరాటాలు జరుగుతున్నాయి. కనుక వేద సిద్ధాంతాన్ని అనుసరించటమే ఉత్తమం.

## వైదిక పునర్జన్మ సిద్ధాంతం

సృష్టికర్తయైన పరమేశ్వరుడు జీవుడు మరలమరల జన్మిస్తాడనీ, క్రొత్త శరీరాలను క్రొత్త మాతాపితరులను పరివారాలను పొందుతాడనీ వేదం ద్వారా (ఋగ్వేదం. 1-24-1, 2 మరియు ఋ. 10-59-5, 6, 7 ; యజుర్వేదం, 4-15 ; అథర్వవేదం 7-67-1 మంత్రాలద్వారా) ఉపదేశించాడు.

### పునర్జన్మను సూచించే మంత్రాలు

మం॥ అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమ్ ఇహ నోధేహి భోగమ్ ।
జ్యోక్ పశ్యామ సూర్యమ్ ఉచ్చరన్తమ్ అనుమతే మృడయా నః స్వస్తి॥
మం॥ పునర్నో అసుమ్ పృథివీ దదాతు పునర్ ద్యౌర్ దేవీ
పునరన్తరిక్షమ్ । పునర్నః సోమః తన్వం దదాతు

పునః పూషా పథ్యాం యా స్వస్తిః॥ – ఋగ్వేదం (10-59-6, 7)

మం॥ పునర్మనః పునరాయుర్ మ ఆగన్, పునః ప్రాణః పునరాత్మా
మ ఆగన్ పునశ్చక్షుః పునః శ్రోత్రం మ ఆగన్ । వైశ్వానరో
అదబ్ధస్తనూపా అగ్నిర్ నః పాతు దురితాదవద్యాత్ " - యజుర్వేదం (4-15)

మం॥ పునర్ మైత్వింద్రియం పునరాత్మా ద్రవిణం బ్రాహ్మణం చ
పునరగ్నయో ధిష్ణ్యా యథాస్థామ కల్పయంతా మిహైవ ।
– అథర్వవేదం (7-67-1)

పై వేదమంత్రాలలోని (ప్రార్థనలలోని) భావమేమంటే 'హే అసునీత పరమేశ్వర! (ఓ ప్రాణదాయక పరమేశ్వర !) మేము మరణించి మరియొక శరీరమును ధరించినపుడు కూడా మమ్ములను సతత సుఖవంతులునుగా చేయుము. పునర్జన్మలోనూ మాకు నేత్రాది ఇంద్రియాలను, దశ ప్రాణులను ప్రసాదింపుము. ఉత్తమోత్తమ భోగాల ననుభవిస్తూ చిరకాలం జీవించునట్లనుగ్రహింపుము. మమ్ము దుష్కర్మల నుండియు, దుఃఖముల నుండియు వేరుచేసి రక్షించి కాపాడుము. నీ వేదాజ్ఞల ననుసరిస్తూ సదా స్వస్తిని పొందునట్లనుగ్రహింపుము''. పునర్జన్మలను గురించి ఆలోచించేముందు 'జీవుడు' అంటే ఎవరో తెలుసుకోవటం అవసరం. అతని గుణకర్మ స్వభావాలను, అతని యథార్థ స్థితిని తెలుసుకోవటం అవసరం.

## జీవుని స్వరూపం

నేను, నేను అని వ్యవహరించే మనమంతా జీవులమే. అయితే, ఈ శరీరం మనం కాదు. ఈ శరీరంలోనే ఈ శరీరం కన్న వేరుగా మనం ఉన్నాం. మనం ఇంట్లో ఉన్నా యింటికన్న వేరుగా ఉంటాం. కారులో ఉన్నా కారు కన్న వేరుగా ఉంటాం. అందుకనే నా యిల్లు, నా కారు అని వ్యవహరిస్తూ ఉంటాం. అట్లే, మనం ఈ శరీరంలోఉండి నా శరీరం, నా కాలు, నా చేయి, నా తల అంటూ షష్ఠీవిభక్తిలో చెబుతూ ఉంటాం. షష్ఠీ విభక్తిలోని నా, నాయొక్క మొదలైన ప్రత్యయాల ప్రయోగం సంబంధాన్ని తెలుపుతుంది. అంటే – వస్తువు మనకన్న వేరుగా ఉన్నపుడు ఆ వస్తువుకు మనకు ఉండే సంబంధాన్ని తెలుపుతుంది. మనం మనస్సుకన్నా బుద్ధికన్నా కూడా వేరుగా ఉన్నాం.

అందుచేతనే నా (యొక్క) మనస్సు, నా (యొక్క) బుద్ధి అని వ్యవహరిస్తున్నాం.

జీవులమైన మనం తెలివిగలిగిన - జ్ఞానం కలిగిన విశిష్టమైన అభౌతిక పదార్థాలం. అంటే- ఈ సృష్టిలో మనం ఇంద్రియాలతో చూచే పదార్థాలవలె కొన్ని పరమాణువుల కలయికతోగాని, కొన్ని మూలకాల (ఎలిమెంట్స్) కలయికతోగాని తయారైన వారంకాదు. అట్లే, మనం అనాదులం. అనాదికాలం నుండి ఉన్నాం. అనంతకాలం వరకు ఉంటాం. కాలాంతరంలో ఈ శరీరం నశించిపోయినా మనం నాశనంకాము - లేకుండాపోము. జీవాత్మను గురించి మన శాస్త్రాలు ఏమంటాయంటే-

**న జాయతే మ్రియతే వా కదాచిత్**
**నాయం భూత్వా భవతా వా న భూయః**
**అజోనిత్య శ్శాశ్వతో౽యం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే ॥** - భగవద్గీత (2-20)

జీవాత్మ ఒకప్పుడు పుట్టలేదు. కాలాంతరంలో అది చావదు. అది నిత్యము. మార్పులు చెందక ఎల్లపుడు ఒకే విధంగా ఉంటుంది. శరీరం నశించినా అది నశించదు.

జీవాత్మలమైన మనం ప్రస్తుతం ఈ శరీరంలో ఉన్నాం. ఈ శరీరం నశించిపోతే మరొక శరీరం వస్తుంది. అయితే, శరీరాలను మనం నిర్మించుకోలేము. అంతటి జ్ఞానంగానీ శక్తిగానీ మనకులేవు. సృష్టికర్తయైన పరమేశ్వరుడే మనకొరకు శరీరాలను నిర్మించియిస్తాడు. ఆ యా శరీరాలు మనం పూర్వజన్మలలో చేసిన కర్మల ననుసరించి ఉంటాయి. మంచి కర్మలు చేసివుంటే మంచి శరీరాలను నిర్మించియిచ్చి భోగభాగ్యాలను, ఎన్నెన్నో సుఖాలను ప్రసాదిస్తాడు. చెడు కర్మలు చేసివుంటే పశు పక్షి క్రిమి కీటకాది శరీరాలు నిర్మించియిచ్చి అ కర్మల ఫలమనుభవింపచేస్తాడు. జాతి, ఆయువు, భోగము మనం పూర్వజన్మలలో చేసిన కర్మలనుబట్టి ఉంటాయని ఋషులంటారు. వీటినే 'ప్రారబ్ధం' అనియును అంటారు. మన ప్రారబ్ధం పూర్తయితే పరమేశ్వరుడు మనను ఈ శరీరంనుండి వేరుచేసి మరొక తల్లి గర్భంలో ప్రవేశింపచేస్తాడు. అక్కడ ఆ తల్లి రక్తంతో మనకొరకు మరొక శరీరాన్ని నిర్మిస్తాడు. ఈ విధంగా

ఒక జన్మ తరువాత మరొక జన్మ వస్తూనే ఉంటుంది. జనన-మరణాలు చక్రభ్రమణం వంటివి.

జీవతత్త్వాన్ని గురించి, జన్మమరణాలను గురించి కృష్ణభగవానుడు అర్జునునకు చాలా సరళమైన భాషలో వివరిస్తాడు. భగవద్గీతలోని రెండవ అధ్యాయమైన సాంఖ్యయోగం చాలా మహత్తరమైనది. మన వేద శాస్త్రాలలోని, ఉపనిషత్తులలోని కొన్ని సృష్టిరహస్యాలను - నియమాలను ముఖ్యంగా జీవుని యథార్థస్థితిని ఈ అధ్యాయం వివరిస్తుంది. జనన మరణాలను గురించి ఏమంటుందంటే-

శ్లో॥ **వాంసాంసి జీర్ణాని యథా విహాయ**
**నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।**
**తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ ॥**

- భగవద్గీత (2-22)

మానవు డేవిధంగా చిరిగిన వస్త్రాలను విడిచి నూతన వస్త్రాలను ధరిస్తాడో, అట్లే, జీవుడు జీర్ణశీర్ణములై తనకు పనికిరాని శరీరాలను వదలి క్రొత్త శరీరాలను ధరిస్తాడు-పొందుతాడు.

ఇంతేగాక, **జాతస్య హి ధ్రువో మృత్యుః** - పుట్టినది ప్రతీది తప్పక చనిపోవు' ననేది సృష్టినియమం. శరీరం పుట్టింది కనుక అది చనిపోక తప్పదు. పుట్టటం అంటే కొన్ని పదార్థాలు కలిసి ఒకటి కావటం. చావటం లేదా నశించటం అంటే ఏ పదార్థాలతో అది పుట్టిందో అది విడిపోయి ఆ మూల పదార్థాలలో కలిసిపోవటం (నాశనం కారణలయః). శరీరం 'భూమి జలము అగ్ని వాయువు ఆకాశం' అనే పంచభూతాల కలయికతో ఏర్పడింది. మరల ఆ పంచభూతాలలో అది కలిసిపోతుంది. జీవుడు పంచభూతాలతో ఏర్పడిన పదార్థం కాదు. కొన్ని పరమాణువులు కలిసి ఏర్పడిన పదార్థంకూడా కాదు. అది అఖండితమైన ఏకపదార్థం. ఎట్టి పరిస్థితులలోను అది నశించదు. కనుకనే-

శ్లో॥ **నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।**
**న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః ॥** -భగవద్గీత (2-23)

'జీవాత్మను ఏ శస్త్రము ఛేదించలేదు. అగ్ని కాల్చలేదు. నీరు తడుపలేదు. గాలి ఎండించలేదు. అది అభేద్యమైన అభౌతిక పదార్థం" అంటాడు యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు.

మనమంతా అటువంటి ఆత్మస్వరూపులం. అమృతస్వరూపులం.

పూర్వజన్మలను పునర్జన్మలను అంగీకరించని క్రైస్తవ మహ్మదీయులు దేవుడు జీవున్ని క్రొత్తగా పుట్టిస్తాడంటారు. అట్లైతే ఏ పదార్థంనుండి జీవున్ని పుట్టిస్తాడనే ప్రశ్న వస్తుంది. ఒకవేళ ఏదైనా పదార్థంనుండి పుట్టించాడు అంటే అది కాలాంతరంలో మరణించాలి. అంటే– దాని మూలకారణంలో కలిసిపోవాలి. అప్పుడు జీవుని అస్తిత్వం సమాప్తమైనట్లే కదా ! ఏ పదార్థంనుండీ పుట్టించలేదు క్రొత్తగా శూన్యం నుండి పుట్టించాడంటే అది సృష్టినియమానికి విరుద్ధమౌతుంది. తత్త్వజ్ఞాని శ్రీకృష్ణుడేమంటాడంటే –

**శ్లో॥ నాసతో విద్యతే భావః నాభావో విద్యతే సతః ।**
**ఉభయో రపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥** -భగవద్గీత (2-16)

అసత్తునుండి (లేనిదాని నుండి – శూన్యం నుండి) ఏదీ పుట్టదు. అట్లే సత్తా కలిగినది (ఉనికి, ఎగ్సిస్టెన్స్ కలిగినది) ఏదీ అభావంకాదు – లేకుండాపోదు. (శూన్యం కాదు). ఈ రెండు శాశ్వత సిద్ధాంతాలను పెక్కురు తత్త్వజ్ఞానులు పరీక్షించి సిద్ధాంతీకరించా"రన్నాడు. కనుక దేవుడుకూడా శూన్యం నుండి జీవున్నిగాని, సృష్టినిగాని పుట్టించలేదు. సృష్టి పరమాణువుల కలయికవల్ల ఏర్పడుతుంది. కాలాంతరంలో మరల పరమాణువులుగా విడిపోతుంది. ఆ స్థితినే ప్రళయమంటారు. ఈ కారణాలచేత జీవులను, పరమాత్మను, సృష్టికి మూలకారణాలైన పరమాణువులను (ప్రకృతిని) ఆది అంతములు లేనివంటారు మన ఋషులు. ఈ విషయాలు వివరంగా తెలుసుకోగోరేవారు మహర్షి దయానందుల వారు రచించిన 'సత్యార్థ ప్రకాశ'మనే అద్భుతగ్రంథాన్ని చదువగోరుచున్నాము.

కొద్దిసేపు శాస్త్రాలను ప్రక్కకుపెట్టి సామాన్య యుక్తులతో సృష్టిని పరిశీలించినా జీవునకు పూర్వజన్మలు పునర్జన్మలు ఉంటాయని

అవగతమౌతుంది. లోకంలో కొందరు భాగ్యవంతులుగా, కొందరు పేదవారుగా, కొందరు ఆరోగ్యవంతులుగా, కొందరు అనారోగ్యవంతులుగా, కొందరు సురూపులుగా కొందరు కురూపులుగా.... పుట్టటం చూస్తాము.

ఈ వ్యత్యాసాలకు కారణమేమిటి ? దేవుడు జీవున్ని క్రొత్తగా పుట్టించి ఈ లోకానికి పంపిస్తే అందరిని సమానంగా పుట్టించాలి కదా ! కొందరిని సుఖపెట్టడం, కొందరిని కష్టపెట్టడం ఎందుకు ? అందరి పుట్టుక సామాన్యంగానే జరిగినా కొందరు విద్యావంతులుగా విజ్ఞానవంతులుగా కళాకారులుగా అనతికాలంలోనే ఉన్నతోన్నత శిఖరాలకు చేరుతూవుండగా మరికొందరు మందబుద్ధులుగా అంతంత మాత్రంగానే ఉండిపోవటమెందుకు ? ఇటువంటివే ఎన్నెన్నో ప్రశ్నలున్నాయి. మనం పూర్వజన్మల నంగీకరించకపోతే దేవుడు పక్షపాతి, అన్యాయకారి ఔతాడు. పూర్వజన్మల నంగీకరిస్తే ఈ వ్యత్యాసాలన్నిటికి కారణం వారు పూర్వజన్మలలో చేసిన పరిశ్రమ, సాధన పరోపకారాది పుణ్యకార్యాలు నని గట్టిగా చెప్పవచ్చు.

అట్లే, మనం పునర్జన్మలనుకూడా అంగీకరించక తప్పదు. కొందరు దొంగతనాలు, ఖూనీలు కుకర్మలు కుంభకోణాలు చేసికూడా ప్రజలకళ్ళూ, కోర్టులకళ్ళూ కప్పి దర్జాగా బ్రతికేస్తున్నారు. ఈ కర్మల ఫలమెప్పు డనుభవించాలి ? కొందరు నీతిగా నిజాయితీగా బ్రతుకుతూ చేతనైనంత పరోపకారం చేస్తూ జీవిస్తారు. ఆ పుణ్యకర్మల ఫలమిక్కడ అనుభవించకుండానే మరణిస్తారు. మరి, ఆ సత్కర్మల ఫలమెప్పు డనుభవించాలి ? మరణానంతరం సత్కర్మల ఫలాన్ని స్వర్గంలోను, దుష్కర్మల ఫలాన్ని నరకంలోను అనుభవిస్తారని కొందరు సర్దిచెప్పయత్నిస్తారు. కాని, స్వర్గ నరకాలనేవి ప్రత్యేకమైన లోకాలుకావు. అవి కేవలం ఊహాలోకాలు మాత్రమే. ఎక్కువ సుఖాలతో కూడిన జన్మ స్వర్గం, ఎక్కువ కష్టాలతో కూడిన జన్మ నరకం అని గుర్తించాలి. స్వర్గ నరకాలు అందుకుతగిన జన్మలేకాని ప్రత్యేక లోకాలు కావు. ఈ విషయాలను తదుపరి ప్రకరణంలో వివరంగా తెలుసుకొందాము.

పూర్వజన్మలు ఉండివుంటే అవి మనకెందుకు జ్ఞాపకం లేవనేది మరొక

ప్రశ్న. మానవుని జ్ఞాపకశక్తికి పరిమితులున్నాయి. కొందరికి జ్ఞాపకశక్తి ఎక్కువగాను, కొందరికి తక్కువగాను ఉంటుంది. కొందరు ప్రయత్నించి జ్ఞాపకశక్తిని పెంచుకుంటారు. వృద్ధాప్యంవల్లా, కొన్ని వ్యాధులలోను, కొన్ని ప్రమాదాలవల్లా, కొన్ని సంఘటనలవల్లా మరుపు వస్తూవుంటుంది. అన్నీ సవ్యంగావున్నా మన బాల్యంలో జరిగిన విషయాలన్నీ మనకు జ్ఞాపకం ఉండవు కదా ! అట్టిది పూర్వజన్మ విషయాలెలా గుర్తుంటాయి ? పూర్వజన్మలను గురించిన మరపు పరమేశ్వరు డిచ్చిన గొప్పవరంగా మనం భావించాలి. లేకుంటే చాలా సమస్యలొస్తాయి. కౌటింబిక వ్యవస్థ అస్తవ్యస్తమౌతుంది. ఈ జన్మలో ఏర్పడిన బరువు బాధ్యతలతోను, సమస్యలతోను సతమతమౌతున్న మనకు పూర్వజ్మలు గుర్తుకువస్తే ఆ సమస్యలుకూడా వీటికి తోడై మన జీవితం దుర్భరమయ్యేది. కనుక ఆ మరపు భగవంతుడు ప్రసాదించిన వరం.

చాలా అరుదుగా అప్పుడప్పుడు కొందరికి పూర్వజన్మస్మృతి కలిగినట్లు వార్తా పత్రికలలో చదువుతూ ఉంటాము. వీటిపై పరిశోధనలు చేసినవారూ కొందరున్నారు. గాఢమైన హిప్నోసిస్‌లోనికి పంపి పూర్వజన్మలను గురించి ప్రశ్నించి ఆ ప్రకారం పరిశోధించిన ఔత్సాహికులు కొందరున్నారు. వీటన్నిటినిబట్టి చూస్తే జీవునకు పూర్వ పర జన్మాలున్నాయని గట్టిగా చెప్పవచ్చు.

సుమారు 100 సంవత్సరాల క్రిందట ఫ్రాన్స్ దేశంలో ఒక భాగ్యవంతురాలి యింట కాలేయ వ్యాధితో ఒక పాప పుట్టింది. ఆమె భాగ్యవంతురాలు కనుక ప్రపంచమంతా తిరిగి ఖరీదైన పలురకాల వైద్యాలు చేయించింది. లాభం కలుగలేదు. చివరకు ఆ పాప చాలా బాధపడుతూ మరణించింది. దానితో ఆ తల్లికి దేవునిపై ఆగ్రహం కలిగింది. అభంశుభం తెలియని నా పసిబిడ్డకు దేవుడింతటి పెద్దబాధ నెందుకు పెట్టాడన్నది ఆమెలో ఉదయించిన ప్రశ్న. ఆమె క్రైస్తవ భక్తురాలు కనుక ముందుగా బైబిలు అంతా చదివి చూసింది సమాధానం కనబడలేదు. క్రైస్తవ గురువుల నడిగితే అదియంతా యహోవా దేవుని అనుగ్రహం ఈ విషయంలో ప్రశ్నించతగదన్నారు. మహ్మదీయ గురువుల నడిగిచూచింది. వారునూ అట్లే చెప్పారు. "అల్లా దేవుని యిష్టం.

ఆయన ఒకరిని భాగ్యవంతునిగా మరొకరిని పేదవానిగా కొందరిని ఆరోగ్యవంతులుగా, కొందరిని రోగులుగా పుట్టిస్తాడు. అంతా అల్లా దయ" అన్నారు. చివరకు ఆమె స్వామీ వివేకానందుల వారిని కలిసి అదే ప్రశ్న వేసింది. దానికి స్వామీజీ శాంత చిత్తంతో జీవుని యథార్థస్థితిని తెలిపి పూర్వజన్మలలో చేసిన పాపకర్మల ఫలమే మీ పసిపాప వ్యాధికి కారణమని తెలిపారు. ఆ సమాధానానికి ఆమె సమాధానపడింది. స్వామీజీ ఆమెకు భగవద్గీతా గ్రంథాన్నిచ్చి చదివిరమ్మని పంపారు. ఆమె భగవద్గీత చదివి చాలా సంతృప్తిచెందింది. క్రమంగా వివేకానందులవారి భక్తురాలై అనుయాయియై ఎన్నో సేవాకార్యాలలో పాల్గొన్నది. ఇట్టి సంఘటన లెన్నెన్నో ఉన్నాయి.

## వైదిక కర్మ సిద్ధాంతం

పరమేశ్వర నిర్మితమైన ఈ చిత్ర విచిత్ర సృష్టిలో జడపదార్థాల సృష్టికన్న ప్రాణిసృష్టి విశిష్టంగా కనబడుతుంది. ఆ ప్రాణిసృష్టిలోనూ మానవప్రాణి మరింత విశిష్టంగా ఉంటుంది. మానవ శరీరంలో జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు వికసించి ఉంటాయి. మనోబుద్ధులు చైతన్యవంతంగా ఉంటాయి. వాటితోనే మానవుడు మిగిలిన జీవులకన్న విశిష్ట సౌకర్యాలతో సుఖంగా బ్రతుకుతున్నాడు. జీవితంలో ఉన్నతోన్నత శిఖరాలకు చేరుకుంటున్నాడు. ఇంతేగాక, మన ఆధ్యాత్మిక శాస్త్రాలు మానవయోనిని కర్మయోని అన్నాయి. యోని అంటే జన్మయనీ, ఒక రకమైన ప్రాణిజాతి (Species) యనీ అర్థం. 'కర్మయోని' అంటే కర్మలు చేయటానికి తగిన సామర్థ్యము సాధనాలు కలిగిన జన్మయని అర్థం. 'కృషి ఉంటే మనుషులు ఋషులౌతారు, మహాపురుషులౌతారు' అని చెప్పినట్లు మానవుడు కర్మశీలుడై – ప్రయత్నశీలుడై శారీరకంగాను, మానసికంగాను, బౌద్ధికంగాను, సామాజికంగాను, ఆత్మికంగాను ఉన్నతిని పొందవచ్చు. ఎన్నెన్నో రంగాలలో పైపైకి ఎదుగవచ్చు.

కర్మలు చేయటానికి పరమేశ్వరుడు మానవునికి మూడు సాధనాలనిచ్చాడు. అవే – మనోవాక్కాయములు. మానవుడు శరీరంతో

కర్మలు చేసినట్లే వాక్కుతోను (మాటలతోను), మనస్సుతోను కర్మలు చేస్తాడు. ఈ మూడు రకాల కర్మలను మానవుడు జ్ఞానపూర్వకంగా చేస్తాడుకనుక వీటన్నిటికి ఫలితాలుంటాయి. వీటితో ధర్మబద్ధమైన మంచి కర్మలు చేస్తే ఉన్నతి కలుగుతుంది. దానికి భిన్నంగా అధర్మకర్మలు చేస్తే అవనతి కలుగుతుంది. కష్టాలు నష్టాలు, భయాలు బాధలు, రోగాలు రొచ్చులు కలుగుతాయి. ఈ కర్మలన్నిటికి ఫలితాల నిచ్చేవాడు సర్వవ్యాపకుడు సృష్టికర్తయునైన పరమేశ్వరుడు. అతడు న్యాయకారి. అతని న్యాయము సున్నితపు త్రాసుతో తూచి తూచి యిచ్చినంత సరిగా ఉంటుంది. అతని కనులు గప్పి (ఎరుకలేకుండా) ఎవడూ ఎక్కడా ఏ కర్మా చెయ్యలేడు. కర్మలకు పరమేశ్వరుడిచ్చే ఫలితాలు వెంటనే కనబడక పోయినా కాలాంతరంలో లేదా జన్మాంతరాలలో తప్పక కలుగుతాయి.

**శ్లో॥ అవశ్య మను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ।**
**నా భుక్తే క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి॥**

చేసిన కర్మ అనుభవించక తప్పదనేది వైదిక కర్మసిద్ధాంతం. మనసా వాచా కర్మణా ఏ ప్రాణిని అకారణంగా హింసించకూడదు. మనస్సులో కీడు తలపెట్టినా అది పాపమే అవుతుంది. పరమేశ్వరుడు సర్వాంతర్యామి కనుక మానసిక కర్మలకూ అతడు సాక్షిగా, ఫలప్రదాతగా ఉంటాడు.

మానవుడు చేసే కర్మలు చిత్రవిచిత్రంగా ఉంటాయి. అవి సత్త్వరజస్తమస్సుల హెచ్చుతగ్గు భేదాలతోను, స్వల్ప మధ్యమ హెచ్చు స్థాయీభేదాలతోను ఉంటాయి. అప్పటి పరిస్థితులు, కర్తయొక్క బౌద్ధికస్థాయి, ఇతరుల బలాత్కారాలు, రాగద్వేష సంస్కారాదుల వత్తిడి ఆ కర్మలో యిమిడి ఉంటాయి. పరమేశ్వరుడు వీటన్నిటిని పరిగణనలోనికి తీసుకొని తగినట్లు న్యాయం చేస్తాడు. అందుకు తగిన ప్రాణిజాతి శరీరంలో ఆ జీవుని ప్రవేశపెట్టి ఆ కర్మఫలాన్ని అనుభవింపచేస్తాడు. అందుకనే లక్షల రకాల ప్రాణిజాతులను సృజించవలసివచ్చింది. "కర్మవైచిత్ర్యాత్ సృష్టివైచిత్ర్యమ్" మానవుడు చేసే కర్మలు చిత్రవిచిత్రంగా ఉంటాయికనుక పరమేశ్వరుడు చిత్ర విచిత్ర ప్రాణిజాతులను సృష్టించవలసి వచ్చింది" అంటుంది సాంఖ్యదర్శనం (6-41).

మరణానంతరం జీవుడు ముందుగా నరకానికి వెడతాడనీ, అక్కడ

పాపఫలాల నన్నిటిని అనుభవించిన తరువాత స్వర్గానికి వెడతాడనీ, అక్కడ పుణ్యఫలాలనన్నిటిని అనుభవించి అనంతరం ఏదైనా ప్రాణిగా పుడతాడనీ భారతీయులలో పెక్కురనుకుంటారు. కాని, ఈ అభిప్రాయాలు సత్యం కావు. ఒకవేళ ఆ విధంగా జరిగితే పాపపుణ్యాలు రెండు తీరిపోవటంవల్ల ఆ జీవుడు ముక్తుడుకావాలి. మరల జన్మించట మెందుకు ? కర్మబంధనం వల్లనే కదా జన్మలు కలుగుతున్నాయి.

దురదృష్టవశాత్తూ కొందరు పుట్టుకతోనే అంధులుగా అవిటివారుగా అనాకారులుగా పుడతారు. కొందరు పుట్టెడు రోగంతో పుట్టి పలురకాల బాధల ననుభవిస్తారు. ఇట్టివారిని చూచి మనం 'నరకాన్ని అనుభవిస్తున్నాడు కదా ! అని జాలిపడతాం. పూర్వపాపాలు నరకలోకంలో అనుభవించివుంటే మరల ఈ బాధలెందుకు ? కష్టాలెందుకు ? కనుక నరకలోకం కల్పిత లోకమే. అట్లే స్వర్గలోకమూ కల్పితమే.

## మృత్యువు బాధాకరమా ?

ప్రజలు అనుకునేటట్లు మృత్యువు అంత బాధాకరమైనది కాదు. మరణ సమయంలో శారీరక బాధలకన్న జీవుడు దేహాత్మభ్రాంతికి గురియై అజ్ఞానంతో తన వారినీ, తన ఆస్తిపాస్తులను వదిలివెళ్ళటానికే ఎక్కువగా బాధపడతాడు. వ్యాధివల్ల కలిగిన బాధలైనా ఒక స్థితి దాటితే మనిషి మూర్ఛపోతాడు - కోమాలోకి వెళ్ళిపోతాడు. మరణ సమయంలోనూ అదే జరుగుతుంది. పరమేశ్వరుడు తేలికగానే జీవున్ని ఆ శరీరంనుండి వేరుచేస్తాడు. అప్పటికీ జీవునకు మరొక రెండు అంతః శరీరాలుంటాయి. వాటిని సూక్ష్మ కారణ శరీరాలంటారు. జన్మలు ఎన్ని మారినా ఈ సూక్ష్మ కారణ శరీరాలు రెండూ జీవుని అంటిపెట్టుకునే ఉంటాయి. జీవుడు మన కంటికి కనబడనట్లే ఈ సూక్ష్మకారణ శరీరాలూ మనకు కనబడవు. పవిత్రుడై యోగసాధన చేసిన జీవుడు మాత్రమే ఈ రెండు శరీరాలనుండి కూడా విడివడి ముక్తిని పొందుతాడు. పరమేశ్వరుని తృతీయధామంలో పరాంతకాలం వరకు - 100 బ్రహ్మ సంవత్సరాలు అంటే 3, 11, 04, 000 కోట్ల సంవత్సరాలు పరమ సుఖాలను

పొందుతూ స్వేచ్ఛగా విహరిస్తాడు.

సుమారు 15, 20 సంవత్సరాలు పూర్వం శ్రీరేమౌండ్ ఎ.మూడీ అనే పేరుగల ఒక ఔత్సాహికరచయితకు "మరణిస్తే ఎటువంటి అనుభవం కలుగుతుం"దనే విషయం తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది. అప్పుడప్పుడు వార్తా పత్రికలలో ఒక వ్యక్తి మరణించిన కొద్దిసేపటికి మరల బ్రతికాడనే వార్తలు ప్రచురింపబడుతూ ఉంటాయి. సాధారణంగా ఊపిరి ఆగిపోయి, గుండెనిలిచిపోయి, నరాలలో చైతన్యం లేకుండాపోతే ఆ మనిషి మరణించినట్లు డాక్టర్లు ధృవపరుస్తారు. అట్టివారుకూడా చాలా చాలా అరుదుగా కొందరు మరల బ్రతికిన సందర్భాలున్నాయి. అట్టివారిని వెతుకుతూ ఆ రచయిత ప్రపంచమంతా పర్యటించి అటువంటి 150 మంది వ్యక్తుల అనుభవాలను సేకరించాడు. వాటిని చక్కగా కూర్చి 'లైఫ్ ఆఫ్టర్ లైఫ్' అనే పేరుతో ఒక పుస్తకం వ్రాసి ప్రచురించాడు. ఆ పుస్తకంలోని కొందరి అనుభవాలను సమీక్షిస్తూ 1977 సంవత్సరంలోని ఇల్లిస్ట్రేటెడ్ వీక్లి ఆఫ్ ఇండియా మార్చి 5, 12, 19 తేదీలలో వెలువడే వారపత్రిక ప్రచురించింది.

అందులో ఒక వ్యక్తి కథ ఏమంటే– అతడు 17 సంవత్సరాల వయస్సులో ఉన్నపుడు తన అన్నగారితో కలిసి నదిలో ఈతకొట్టడానికి వెళ్ళాడు. ఈత కొడుతూ నది మధ్యలోకి వెళ్ళిపోయాడు. అక్కడ నదీ ప్రవాహం తీవ్రంగా ఉంది. సుళ్ళు తిరుగుతూ నది ప్రవహిస్తోంది. ఆ ప్రవాహ పట్టునుండి విడివడి అతడు బయటకు రాలేకపోయాడు. మునుగుతూ తేలుతూ క్రమంగా మృత్యుముఖంలోకి వెళ్ళిపోయాడు. అన్నగారు చాలా సాహసించి ఆ కుర్రవాన్ని ఒడిసి పట్టుకుని ఈదుకుంటూ ఎట్లో ఒడ్డుకు చేర్చాడు. అప్పటికే ఆ వ్యక్తి శ్వాస ఆగిపోయింది. గుండె నిలిచిపోయింది. కొందరి సహకారంతో వెంటనే సమీపంలోని హాస్పిటల్‌కు తీసుకుపోయాడు. అక్కడి వైద్యులు పొట్టనొక్కి నీళ్ళుబైటకి పోయేటట్లు చేశారు. కృత్రిమశ్వాస కల్పించే ప్రయత్నం చేశారు. శ్వాసరాలేదు. గుండె స్పందించలేదు. వైద్యులు పరీక్ష చేసి ఈ వ్యక్తి చనిపోయాడు తీసుకువెళ్ళి అంత్యక్రియలు జరిపించండన్నారు. చేసేదిలేక బంధువులు ఆ ప్రయత్నంలో ఉండగా అతని శరీరంలో కదలికలు కనబడ్డాయి. నెమ్మదిగా

శ్వాసక్రియ జరగటం, గుండెకొట్టుకోవటం జరిగాయి. కొంతసేపటికి లేచి కూర్చోవటం, మాట్లాడటం జరిగాయి. క్రమంగా అతడు సామాన్య జీవితం గడిపాడు. అతనిని ఈ గ్రంథకర్త "ఆ మృత్యుసమయంలో నీ అనుభవమేమిటో చెప్పు"మని కోరగా – "నేను ఆ సమయంలో శరీరాన్నుండి వేరైపోయినట్లుగా అనిపించింది. నేను వేరుగా వుండి నా శరీరం నదీ ప్రవాహంలో కొట్టుకుపోతుండగా నేను చూశాను. బయటకు తీసుకురావటం వైద్యుల ప్రయత్నం అస్పష్టంగా చూశాను. ఇవన్నీ నేను నా శరీరం నుండి 3, 4 అడుగుల దూరం నుండే చూచినట్లు అనుభవమయ్యింది. ఏమైనప్పటికీ నేను శరీరం నుండి వేరుగా మరొక శరీరంతో ఉన్నట్లు అనిపించిం"దని చెప్పాడు.

ఇట్లే, ఆ గ్రంథంలోని మిగతావారి అనుభవాలలోనూ మృతశరీరం కన్న వేరుగా తాము మరొక శరీరంలో ఉండి దానిని చూచినట్లుగా చెప్పారు. ఈ అనుభవాలన్నీ వారు సూక్ష్మశరీరంతో పొందినట్లు మనం ఊహించవచ్చు. స్థూలశరీరంతో తాను పొందిన అనుభవాలు, చేసిన కర్మలు సూక్ష్మశరీరంలో సంస్కారాలుగా ఏర్పడతాయి.

**శ్లో॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వర : ।**
**గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్॥**

భగవద్గీత (15–8)లో చెప్పినట్లు జీవుడు శరీరాన్ని వదలిపెట్టి వెళ్ళేటప్పుడు గాలి పువ్వులోని సుగంధాన్ని తనవెంట తీసుకొని పువ్వును అక్కడే వదలి వెళ్ళిపోవునట్లుగా జీవుడు స్థూలశరీరాన్ని అక్కడనే వదలి సూక్ష్మేంద్రియాలు, మనస్సుతో కూడిన సూక్ష్మశరీరాన్ని తనవెంట తీసుకువెడతాడు.

ఈగ్రంథంలో పేర్కొన్న వారెవ్వరూ తాము శరీరాన్ని వదలి వేరైనపుడు పెద్దగా బాధేమీ కాలేదని చెప్పారు. కనుక మృత్యువు బాధాకరముకాదు.

మానవ శరీర సామాన్య ఆయుర్దాయం 100 సంవత్సరాలు. చాలా జాగ్రత్తగా ఆరోగ్యనియమాలు పాటిస్తూ పోషణ చేసుకుంటే మరికొంతకాలం ఆరోగ్యంగా జీవించవచ్చు. ఏమైనప్పటికి శరీరంలో వృద్ధావస్థ వస్తుంది. దృష్టి మందగిస్తుంది. వినికిడి తగ్గుతుంది. పళ్ళు ఊడిపోవడం, శరీరం ముడతలు

పడటం మొదలైన మార్పులు వస్తాయి. శరీరం జీర్ణశీర్ణమౌతుంది. అటువంటి శరీరంలో యింకా ఎంతకాలం ఉంటాం. అప్పుడు పరమేశ్వరుడు దయతలచి జీవాత్మలమైన మనను ఆ శరీరం నుండి వేరుచేసి మరొక తల్లి గర్భంలో ప్రవేశపెడతాడు. అక్కడ మన కొరకు మరొక క్రొత్త శరీరాన్ని నిర్మించి ఈ లోకానికి తీసుకువస్తాడు. మరల ఆటపాటలతో గడిపే బాల్యం, విషయసుఖాల ననుభవిస్తూ పురుషార్థంతో అభిరుచిగల రంగంలో ఉన్నతిని సాధించే యౌవనం వస్తాయి. కనుక మృత్యువు అవసరమే.

## మృతకశ్రాద్ధ మవసరమా ?

"శ్రాద్ధ" మంటే శ్రద్ధతో సేవచేయటమనీ, శ్రద్ధతో వారి కవసవరమైన పదార్థాల నర్పించటమనీ అర్థం. "తర్పణ" పదంలోనూ యిట్టి అర్థమే ఉంది. అన్న వస్త్ర ఫలాదులనిచ్చి తృప్తి పరచటాన్ని తర్పణమంటారు. ఈ రెండు క్రియలు జీవించియున్నవారి పట్ల సాధ్యమౌతాయేకానీ మృతులపట్ల కాదు. శ్రాద్ధ తర్పణాలు ఎప్పుడో సంవత్సరానికి ఒకటి రెండు పర్యాయాలు చేసినంతమాత్రాన సరిపోదు. అవి ప్రతిదినం చెయ్యవలసిన నిత్యకర్మలని మన శాస్త్రాలు చెబుతాయి.

**శ్లో॥ కుర్యా దహరహః శ్రాద్ధ మన్నాద్యేనోదకేన వా ।**
**పయో మూల ఫలైరపి పితృభ్యః ప్రీతి మావహన్॥** - మనుస్మృతి (3-82)

"ప్రతి దినం శ్రద్ధా భక్తులతో జీవించియున్న పితరులను అన్నపానీయాలతోను, పాలు పండ్లు కందమూలాలతోను తృప్తిపరచి వారి దీవనలను పొందా"లని ఆది స్మృతిగ్రంథమైన మనుస్మృతి చెబుతుంది. దీనినే పితృయజ్ఞమనీ, గృహస్థులు నిత్యం ఆచరించవలసిన పంచ మహాయజ్ఞాలలో యిది ఒకటి యనీ శాస్త్రాలు చెబుతాయి. పితర పదం జీవించియున్నవారి గురించే చెప్పబడుతుంది. గతించినవారిని గురించి కాదు. గతించినవారిని ప్రేతలంటారు. ప్రేతలంటే చక్కగా శరీరాన్ని వదలిపెట్టినవారని అర్థం. అట్టి ప్రేతలకు శ్రాద్ధ తర్పణాదులు పెట్టాలని ఏ శాస్త్రంలోనూ లేదు.

స్థూల శరీరంతో కూడిఉన్నప్పుడే జీవునకు ఆకలి దప్పికల

అనుభవమౌతుంది. అసలు ఆకలి దప్పికలు స్థూల శరీరానికే కాని జీవునకు కాదు. సూక్ష్మకారణ శరీరాలకు ఆకదలిదప్పికలుండవు. ఈ విషయం పౌరాణిక పండితులుకూడా అంగీకరిస్తారు. అందుకని వారు చనిపోయిన వ్యక్తికి (జీవాత్మకు) యాతనా (పిండజ) శరీరాన్ని నిర్మించాలని ఆ ప్రయత్నం చేస్తారు. గరుడ పురాణం ప్రేతాధ్యాయంలో చెప్పినట్లు దశగాత్ర పిండములు పెట్టిస్తారు. వాటితో రోజుకొక అవయవం చొప్పున ఉత్పత్తియై 10వ దినాన ఆకలి దప్పికలు పుడుతాయంటారు.

కొన్ని ప్రాంతాలలో వ్యక్తి చనిపోయినచోటగాని, మరొకచోటగానీ నేలపై నవధాన్యాలను పోసి పైన ధారాపాత్ర కట్టిస్తారు. క్రొత్తకుండకు క్రింద చిన్న రంధ్రంచేసి దానిలో గుడ్డవత్తిపెట్టి ఏవో కొన్ని సంస్కృత వాక్యాలు చదువుతూ ఆ పాత్రలో రోజూ క్రొత్త నీరుపోయిస్తారు. దానిలోని నీరు చుక్కలు చుక్కలుగా క్రిందపోసిన నవధాన్యాలపై పడతాయి. దానితో గింజలు మొలకెత్తి పెరుగుతాయి. ఆ విధంగానే మరణించిన జీవునకు యాతనాశరీర మేర్పడుతుందంటున్నారు. అమాయకులైన ప్రజలు నమ్ముతున్నారు. ఈ విషయం వేదాలలో గానీ, ఋషులు వ్రాసిన గ్రంథాలలోగానీ ఎక్కడాలేదు.

## గరుడ పురాణం కల్పిత గ్రంథం

గరుడ పురాణం ఋషులు వ్రాసిన గ్రంథం కాదు. ఎవరో సంస్కృతం నేర్చిన స్వార్థపరులు వ్రాసిన గ్రంథం. తమ పేరుతో వ్రాస్తే ప్రజలు నమ్మరని వ్యాసులవారి పేరుతోను శౌనకాది మహామునుల పేరుతోను దానిని వ్రాసి ప్రచారం చేశారు. దానిలో పరస్పర విరుద్ధమైన విషయాలు చాలా ఉన్నాయి. చరిత్రకారుల పరిశోధనలో తేలిందేమిటంటే – బౌద్ధమతం వ్యాప్తి చెందిన తరువాతనే యిది వ్రాయబడిందట.

మహాభారతయుద్ధం తరువాత మనదేశంలో వైదిక కర్మకాండ వికృతరూపం ధరించింది. ఏ ప్రాణిని హింసించని, సర్వప్రాణులకు మేలుచేసే యజ్ఞయాగాదులలో ప్రాణిహింస ప్రారంభమయ్యింది. ఆవులను గుఱ్ఱాలను మేకలను మంత్రాలు చదువుతూ చిత్రహింసలకు గురిచేసి చంపేవారు. వాటిని

యూపస్తంభానికి కట్టి వధించేవారు. వాటి మాంసాన్ని అగ్నిహోత్రంలో ఆహుతులిచ్చి మిగిలిన మాంసాన్ని ప్రసాదం పేరుతో భుజించేవారు. వివేకవంతులు ఇదేమి ధర్మమని ప్రశ్నిస్తే 'వైదికీ హింసా హింసా న భవతి' అనే కల్పిత సూత్రాలను చూపించేవారు. మహాత్మా బుద్ధుడు ఎన్ని రకాలుగా వారికి నచ్చచెప్పినా వారు వినలేదు. దానితో ఆయన విసిగి 'అహింసా పరమో ధర్మః' అంటూ ప్రచారం చేశారు. వివేకవంతులు, ఆలోచనాపరులు భూతదయాపరులు బుద్ధుని బోధనల ననుసరించారు. క్రమంగా బౌద్ధమతం వ్యాప్తి చెందింది. అశోక చక్రవర్తి కాలంలో అది దేశాన్నిదాటి నలుదిశల వ్యాపించింది.

బౌద్ధమతం హిమాలయాలను దాటి టిబెట్ చైనా జపాన్ జర్మన్ దేశాలవరకు వ్యాపించింది. క్రమంగా ఆయా దేశాలవారి హృదయాలలో మన దేశం తీర్థయాత్రా స్థలంగా గురువుగారి జన్మభూమిగా, పుణ్యభూమిగా స్థానం పొందింది. ఆ యా దేశాలనుండి పర్యాటకులు వచ్చి బుద్ధుని జన్మస్థానమైన లుంబినీవనాన్ని, బుద్ధునికి జ్ఞానోదయం కలిగిన ఇరువేల (ఇప్పటి బుద్ధగయ)ను దర్శించేవారు. చైనీయులలో మరణించిన వారి నుద్దేశించి పిండాలు పెట్టే ఆచారముండేది. వారు దానిని పాటిస్తూ మరణించిన గురువుగారికి బుద్ధగయలో పిండాలు పెట్టేవారట. అది చూసిన మన సామాన్య ప్రజలు మరణించిన పెద్దలకు పిండాలు పెట్టాలేమో! నని వారు వారి పెద్దలకు పిండాలు పెట్టడం ప్రారంభించారట. అది క్రమంగా 'వేలంవెర్రిగా' దేశమంతా వ్యాపించింది. పురోహితులు సంపాదించటానికి యిది చక్కని అవకాశంగా భావించి ఆ పిండ ప్రధానానికి కొన్ని మంత్రాలు, సంస్కృత వాక్యాలు కూర్చారు. దానితో అది అనివార్యంగా ఆచరించవలసిన విధికర్మగా తయారయ్యింది. అది క్రమంగా పెరిగి పెరిగి పెండ్లికి ఖర్చుపెట్టినంత అంత్యక్రియలకు ఖర్చుపెట్టేటంత స్థితికి చేరింది. ఈ మూఢాచారాన్ని పెంచి పెద్దచేసి లాభాలను పొందటానికే గరుడ పురాణం వ్రాయబడిందంటారు చరిత్ర పరిశోధకులు. ఇది వేద వ్యాసులవారు వ్రాసినదికాదు.

వేద వ్యాసులవారు గొప్ప వేదవిద్వాంసులు. ఆ కాలంలో

ఈశ్వరీయజ్ఞానమైన మూల వేదాలు శాఖాగ్రంథాలలో కలిసిపోయి ఏవి మూలములో ఏవి శాఖలో తెలియని స్థితి ఏర్పడింది. అప్పుడు మహర్షి దయానందులవారివలె శుద్ధమైన వేదాలను వేరు పరచి ముందుతరాల కందించిన గొప్ప మహర్షి వ్యాసులవారు. వారు వ్రాసిన బ్రహ్మసూత్రాలు (వేదాంత దర్శనం) చాలా గొప్ప తాత్త్విక గ్రంథం. మహాభారతం ధర్మార్థకామాలను వివరిస్తూ వ్రాసిన ఒక చరిత్ర. అట్టి మహర్షి యిట్టి పుక్కిటి పురాణం వ్రాశారంటే నమ్మతగిన విషయం కాదు.

**శ్లో॥ నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి ।**
**అభుక్త్వా యాతనాం జంతుర్మానుష్యం లభతే న హి॥**

– గరుడ పురాణము (1-46)

గరుడ పురాణం ఒక విచిత్రమైన గ్రంథం. దాని ప్రథమాధ్యాయంలో "చేసిన పాపం అనుభవింపక తప్పదు. మరొకమార్గం లేదు. అందుకని దశదినకర్మచేసి పిండాలుపెట్టి యాతనా శరీరాన్ని నిర్మించాలని" వ్రాసి ఉంది. మరొకచోట మృతుని గోత్రనామాలతో గోదాన భూదాన శయ్యాదానాదులు చేస్తే పాపాలు క్షయించి నరక బాధలు తప్పుతాయని ఉంది. మరొకచోట కేవలం హరినామస్మరణ చేస్తే చాలు బ్రహ్మహత్యాపాతకం కూడా క్షయిస్తుందనీ, అట్టివారు అసలు నరకానికే పోరని వ్రాయబడింది. వేరొకచోట తులసీదళాన్ని ధరించి మరణించినవ్యక్తి మహాపాపాత్ముడైనా యమపురానికిపోక నేరుగా విష్ణుపురానికి పోతాడని చెప్పబడింది. ధనిష్ఠాపంచకంలో (ధనిష్ఠా, శతభిష, పూర్వాభాద్రా, ఉత్తరాభాద్రా, రేవతి నక్షత్రాలలో) మరణించినా, ఆ నక్షత్రాలలో దహనం చేసినా మరణించిన వ్యక్తికీ, ఆ యింటిలోని వారికి చాలా కీడు కలుగుతుందట ! ! ఇంతేకాక, ఈ దశమాధ్యాయంలో సతీ సహగమనాన్ని ప్రోత్సహించే కథనం చాలా ఉంది. సహగమనం చేసిన స్త్రీ ఆ పతితో ఎన్నెన్నో స్వర్గసుఖాల ననుభవిస్తుందనీ, భయపడి సహగమనం చేయని స్త్రీ చాలా చాలా నరకయాతనల ననుభవిస్తుందనీ చెప్పబడింది. ఇటువంటి అవైదిక అహేతుక అనైతిక అమానుష విషయాలతో కూడిన ఈ గ్రంథం వ్యాసమహర్షి వ్రాశారంటే నమ్మలేకుండా ఉన్నాం.

ఈ దశమాధ్యాయంలోనే - "యావదస్థి మనుష్యస్య గంగాతోయేషు తిష్ఠతి। తావద్వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే" అంటూ అస్తికలు గంగా నదిలో కలిపితే పాపాత్మునికైనా సరే తేలికగా స్వర్గం ప్రాప్తిస్తుందంటూ చాలా తేలికైన ఉపాయం చెప్పబడింది. వయస్సునుబట్టి వర్ణాలనుబట్టి అంత్యక్రియలు వేరువేరుగా చెయ్యాలట. పుత్రులు లేనివారికి పున్నామనరకం తప్పదంటూనే వానికి కొన్ని ప్రత్యామ్నాయాలు చెప్పబడ్డాయి. చివరి అధ్యాయం కర్మకాండను, వేదశాస్త్రాధ్యయనాన్ని నిరసిస్తూ జ్ఞానమొక్కటే శ్రేష్ఠమైనదనీ, దానిలో అద్వైత భావనే సర్వశ్రేష్ఠమైనదనీ, అది గురువాక్యోపదేశం వల్లనే లభిస్తుందనీ బోధించబడింది. ఈ రకంగా సాగిన ఈ గ్రంథంలో పరస్పర విరుద్ధ విషయాలు చాలానే ఉన్నాయి.

## యము డెవరు ? యమలోక మెక్కడ ?

గరుడ పురాణాన్ననుసరించి - "వైతరణీనదిని దాటిన తరువాత బహూభీతిపురం వస్తుంది. అక్కడనుండి 44 ఆమడల( ) దూరంలో యమపుర ముంటుంది. శరీరాన్ని వదలిన పాపాత్ములంతా ముందుగా ఈ యమపురానికి పోతారు. అక్కడ భయంకరాకారుడైన యమధర్మరాజు పెద్ద దున్నపోతుపై కూర్చుని ఉంటాడు. అతని శరీరం 3 ఆమడల పొడవంత ఉంటుంది. 32 భుజాలతో (చేతులతో) దిగుడు బావులవంటి కళ్ళతో రక్తనేత్రాలతో అతి భయంకరంగా ఉంటాడు. యముని కంటెను భయంకరమైన దూతలు (కింకరులు) అతని చుట్టూ నిలబడి గర్జిస్తూ ఉంటారు. చిత్రగుప్తుడును అట్లే భయంకరంగా ఉంటాడు. కాని, ఈ భూమిపై వైతరణీనదిగానీ, యమపురం కానీ, యముడు కానీ ఇంతవరకు కనబడలేదు. వేరే గ్రహాలపైనా అటువంటి యమలోక ముంటుందనటానికి ఆధారాలేమీ లేవు. కనుక ఇది పూర్తిగా కల్పితము.

అయితే, వైదిక ధర్మానికి మూలగ్రంథాలైన వేదాలలో 'యమ' పదం చాలా చోట్ల కనబడుతుంది. అక్కడ ఆ ప్రకరణాన్ని బట్టి 'యమ' పదానికి వేరే వేరే అర్థాలుంటాయి. వైదిక వ్యాకరణాన్ననుసరించి యమ పదం

'యమ-ఉపరమే' అనే మూల ధాతువుతో నిర్మింపబడుతుంది. కనుక - 'యము'డంటే "నియమించేవాడు. నియంత్రణలో పెట్టేవాడు"నని అర్థం. అందుచే ప్రకరణాన్నిబట్టి ఋతువులను, అగ్నిని, వాయువును, విద్యుత్తును సూర్యుని యమ పదంతో పేర్కొంటాయి వేదాలు. ఈ యమ పదం సర్వవ్యాపక సర్వేశ్వరునికినీ వర్తిస్తుంది. అప్పుడు ఈ విధంగా నిర్వచిస్తారు - 'యః సర్వాన్ ప్రాణినో నియచ్ఛతి స యమః' - అన్ని ప్రాణులకు న్యాయంగా కర్మఫలాల నిచ్చి భోగింపచేస్తాడు కనుక పరమేశ్వరునకు 'యము' డని మరియొక పేరు.

మృత్యుప్రకరణంలో యము డంటే వాయువు. యమాలయము, యమపురము అంటే వాయులోకం. వేదం ఏమంటుందంటే -

**మం. సూర్యం చక్షుర్గచ్ఛతు, వాతమాత్మా, ద్యాం చ గచ్ఛ**
**పృథివీం చ ధర్మణా। ఆపో వా గచ్ఛ యది తత్ర**
**తే హిత మోషధీషు ప్రతితిష్ఠా శరీరైః ॥** - ఋగ్వేదము (10-16-3)

ఓ మానవులారా ! ఈ శరీరం పంచభూతాలతోను, కొన్ని ప్రాకృతిక శక్తులతోను ఏర్పడింది. కనుక, మరణానంతరం శరీరం ఆ యా తత్త్వాలలోకి వెళ్ళిపోతుంది. చక్షురింద్రియశక్తి దాని మూల తత్త్వమైన సూర్యుని చేరుకుంటుంది. జీవాత్మ ముందుగా వాయువులో చేరుతుంది. అక్కడనుండి దాని కర్మానుసారం ద్యులోకాలలోనికి కానీ, పృథివిపైకి కానీ, జలంలోనికి కానీ చేరుకుంటుంది. లేదా ఓషధుల లోనికి కాని చేరుకొని దాని కర్మకు తగిన శరీరాన్ని పొందుతుంది.

పై వేదమంత్రం ద్వారా పరమేశ్వరుడిచ్చిన సంకేతాన్నిబట్టి మరణానంతరం జీవుడు వాయువులో చేరతాడు. వాయువుకు వేదాలలో యము డనే పేరుకూడా ఉంది. ఆ రకంగా జీవుడు యమలోకానికి - వాయులోకానికి వెడతాడని చెప్పవచ్చు కాని గరుడ పురాణ వర్ణిత యమలోకం ఎక్కడా ఉండదు. **'భస్మాంతం శరీరమ్'** (యజుర్వేదం 40-15) శరీరం భస్మంగా అంతమౌతుంది. జీవుడు అతని కర్మానుసారం పరమేశ్వర వ్యవస్థకు కట్టుబడి మరొక శరీరాన్ని ధరిస్తాడు. కనుక, గరుడ పురాణంలో చెప్పబడిన విధి విధానాలేవీ చెయ్యనక్కరలేదు. మరణించిన గృహవాతావరణం శుద్ధి చేయడానికి

అగ్నిహోత్రం ఎక్కువగా ఉపయోగపడుతుంది. అప్పుడు జరిపే సత్సంగంవల్ల ఆత్మానాత్మవివేకం కలిగి మనస్సు శాంతిస్తుంది. కనుక, అప్పుడు శాంతిహోమం చెయ్యటం ఉత్తమం.

## శాంతిహోమం - బృహత్ యజ్ఞం

శ్మశానంలో శవాన్ని దహనంచేసి వచ్చిన అనంతరం అందరూ శుద్ధంగా స్నానం చెయ్యాలి. నూతన యజ్ఞోపవీతాలు ధరించాలి. మరణించిన యింటినికూడా కడిగి శుద్ధం చెయ్యాలి. అందరూ శాంతంగా కూర్చొని పరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనలు చెయ్యాలి. బృహత్ యజ్ఞంతోబాటు అథర్వవేదంలోని శాంతిసూక్తం (19-1-9) మంత్రాలతో ఆహుతులివ్వాలి. అర్థభావనతో ఆహుతులివ్వటంవల్ల మరింతగా మనస్సు శాంతిస్తుంది. మాచే ప్రచురింపబడిన శాంతిసూక్తంలో ఆ మంత్రాలకు సంక్షిప్త వైజ్ఞానికార్థం వ్రాయబడింది. దానిని అనుసరించవచ్చు. సమయముంటే యజుర్వేదంలోని 40వ అధ్యాయం (ఈశావాస్య సూక్తం)తోనూ ఆహుతులివ్వటం మంచిది. ఆ మంత్రాలలోనూ పరమేశ్వరుని మహిమ, ఆత్మానాత్మ వివేక జ్ఞానం ఉన్నాయి. అందుకు తగిన ప్రవచనాల నేర్పాటు చేయవచ్చును. అప్పటికి రాత్రి బాగా ప్రొద్దుపోతే మరునాడు పెద్దగా యజ్ఞం సత్సంగం చెయ్యవచ్చు. వీలునుబట్టి 3 రోజులు అంతకన్నా ఎక్కువ రోజులు యజ్ఞ సత్సంగాలు జరుపుకోవటం మంచిది. అప్పటినుండి ప్రతి సంవత్సరం చనిపోయిన దినమున తద్దినం పెట్టేకన్న శాంతిహోమం చేసి వివేక జ్ఞానాన్ని, పరమాత్మజ్ఞానాన్ని, శాంతిని పొందటం అన్ని విధాల మంచిది.

తల్లిదండ్రులు మనల్ని కని, పెంచి పెద్దజేయటమేకాక వారు కష్టించి, సంపాదించిన ఆస్తిపాస్తులను మనకిచ్చి వెళ్ళారుకనుక వారిపై కృతజ్ఞత కలిగివుండటం ధర్మం. ఇంతేగాక, **"అనువ్రతః పితుః పుత్రః మాత్రాభవతు** సంమనాః - (అథర్వ 3-30-2) అంటుంది వేదం. అంటే పుత్రులు, పుత్రికలు పితరులకు అనువ్రతులు కావాలి. వారు చేసిన దాన ధర్మాది సత్కార్యాలు ఆపకుండా కొనసాగించాలి. వారి స్మృతిలో కొన్ని ధర్మకార్యాలు చెయ్యాలి.

సామాజిక ప్రయోజనకరమైన అన్నదానం, విద్యాదానం, జ్ఞానదానం మొదలైనవి చెయ్యాలి. ఆ పుణ్యం మనకే వస్తుంది. దానితోబాటు పితరులకు కృతజ్ఞతలు తెలుపుకున్నట్లవుతుంది. ఆ విధంగా చేస్తే మన పిల్లలు మనను అనుసరిస్తారు. మనను ఆదరిస్తారు. ఇది పరంపరంగా కొనసాగితే (ధర్మకార్యాలు చేస్తూవుంటే) లోకాని కెంతో మేలు జరుగుతుంది.

అగ్నిహోత్రంలోనుండి వెలువడే వాయువులన్నీ మేలుచేసేవే. అవన్నీ రోగకారక క్రిములను సంహరించి ప్రాణిమాత్రులన్నిటికీ ఆరోగ్యాన్నిస్తాయి. పుష్టిని బలాన్ని కలిగిస్తాయి. అవి మనస్సుపైనకూడా పనిచేసి మానసిక రోగులకు కూడా ఉపశాంతిని కలిగిస్తున్నాయని పరిశోధనలలో కనుగొనబడింది. వివరంగా తెలుసుకోగోరేవారు మా ప్రచురణలు – 'అగ్నిహోత్రవైజ్ఞానిక స్వరూపము', 'అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ' చదువగోరుచున్నాము.

ఇక్కడ పాఠకులు గమనించవలసిందేమంటే ఈ శాంతిహోమ సత్సంగాలు మన ఆరోగ్యం కొరకు మనఃశాంతి కొరకేగాని దివంగతఆత్మకొరకు కాదు. దివంగత ఆత్మ ఎక్కడుందో ఏలోకానికి చేరుకుందో మనకు తెలియదు. ఏ మంత్రాలు చదివి మనం అర్పించినా అవి దివంగత ఆత్మకు చేరవు. ఆ శక్తి మనకు లేదు. చాలాకాలం మనమధ్య గడపిన ఆ దివంగత ఆత్మ ఏ లోకంలో ఉన్నా, ఏ శరీరంతో ఉన్నా సుఖ శాంతులతో ఉండాలని కోరుకుంటాము. దివంగతాత్మకు సుఖశాంతులు ప్రసాదించుమని మనసారా పరమేశ్వరుని ప్రార్థిస్తాము. ఇది ఒక సానుభూతి మాత్రమే. ప్రార్థన మాత్రమే.

గతించిన ఆత్మలకు మనకు మధ్య పితృదేవతలుంటారని, వారు తపాలా ఉద్యోగస్తులవలె మనం పెట్టిన పిండాలను వారికి చేరవేస్తారనీ గరుడపురాణంలో వ్రాసి ఉంది. కొందరు స్వాములునూ యిట్లే చెబుతున్నారు. కానీ, వీటికి శాస్త్ర ప్రమాణమేదీ చూపలేకపోతున్నారు. యుక్తితోనూ యిది సంగతము కాదు. 135 సంవత్సరాలుగా ఆర్యసమాజ విద్వాంసులు ఈ విషయంపై శాస్త్రార్థాలు చేస్తున్నారు. అంతటా ఆర్యసమాజమే జయిస్తున్నది.

శ్రాద్ధభోజనం పితరులకు చేరదని చెప్పటానికి పద్మపురాణంలో ఒక

కథ చెప్పబడింది. – ఒక గ్రామంలో సుమిత్రుడు జయశ్రీ అనే పేర్లుగల వృద్ధ బ్రాహ్మణ దంపతు లుండేవారు. వారికి సుమతి అనే పేరుగల ఒక కుమారుడున్నాడు. అతని వివాహము చంద్రావతితో జరిపించారు. కాలాంతరంలో ఆ వృద్ధదంపతులు మరణించి స్వస్వ కర్మానుసారం ఆ యింటియందే తండ్రి ఎద్దుగాను, తల్లి కుక్కగాను జన్మించారు. ఒక దినం తండ్రి శ్రాద్ధం వస్తే కుమారుడు చాలా భక్తిశ్రద్ధలతో బ్రాహ్మణులను పిలిచి షడ్రసోపేతంగా భోజనం పెట్టాడు. ఆ రాత్రి కుక్క, ఎద్దు రూపంలో ఉన్న తల్లిదండ్రుల మధ్య సంభాషణ ఈ విధంగా జరిగింది.

కుక్క : బ్రాహ్మణార్థం (శ్రాద్ధభోజనం చెయ్యటంకొరకు) పిలువబడిన బ్రాహ్మణులకోసం కోడలు పరమాన్నం సిద్ధం చేసింది. దానిలో ఒకపాము విషం కక్కటం నేను చూశాను. అట్టి దానిని తింటే బ్రాహ్మణుల కపకారం కలుగుతుందని కోడలు చూస్తూ ఉండగా ఆ పరమాన్నాన్ని నేను ముట్టుకున్నాను. కోడలుకు కోపం వచ్చి పొయ్యిలోని కొరవితో నా నడుం విరగ్గొట్టి దూరంగా తీసుకువెళ్ళి కట్టివేసింది. అన్నం కూడా పెట్టలేదు. చాలా బాధగాను, ఆకలిగాను ఉన్నదన్నది.

ఎద్దు : నేడు నా కొడుకు బ్రాహ్మణులకు తృప్తిగా భోజనం పెట్టాడేకాని నాకు గడ్డివేయటం మరచాడు. పగలంతా నా మూతికి చిక్కంగట్టి నాగలి లాగించాడు. శ్రాద్ధం పెట్టాలనే తొందరలో యింటికి తీసుకువచ్చి గుంజకు కట్టేశాడు. తినటానికి గడ్డి వెయ్యటం మరచాడు. ఆకలితో అలమటిస్తున్నాను. నీ బాధ అలా ఉంది, నా బాధ యిలా ఉందంటూ విలపించింది.

ఈ పద్మపురాణ కథను బట్టి చూచినా శ్రాద్ధభోజనం వల్ల దివంగత పితరుల ఆకలి తీరటం లేదు కదా ! మరెందుకు మృతకశ్రాద్ధం ?

## జీవుల ప్రవృత్తి మూడు రకాలు

ఛాందోగ్యోపనిషత్తు జీవులను 3 వర్గాలుగా విభజించి వారి మరణానంతర గతిని వర్ణిస్తుంది. 1. నిష్కామ జీవులు, 2. సకామ జీవులు, 3. జాయస్వమ్రియస్వ జీవులు నని జీవులు మూడు రకాలుగా ఉంటారంటుంది.

ఆ వర్గాలను గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము.

**నిష్కామ జీవులు :**

పూర్వజన్మలలో చేసిన పుణ్యకార్యాలవల్లా సాధనవల్లా కొందరిలో వివేకజ్ఞానం ఉదయిస్తుంది. దానికితోడు ఈ జన్మలో చేసిన స్వాధ్యాయ సత్సంగాలు కలిసి వారు యోగ మార్గానుగాములౌతారు. తాము అభౌతికమైన అనాది జీవులమనీ, పరమేశ్వరానుగ్రహం వల్ల ఈ ఉత్తమోత్తమమైన మానవ శరీరం లభించిందనీ గుర్తిస్తారు. వేద సందేశాన్ని, ఋషుల సందేశాన్ని అనుసరించి కాయక వాచక మానసిక తపస్సుల నాచరిస్తారు. వీలైనంత ఎక్కువగా పరోపకారాది సత్కర్మల నాచరించి వాటి ఫలితాలను పరమేశ్వరున కర్పిస్తారు. అంటే- ఆ సత్కర్మలతో ఎట్టి భౌతిక సుఖాలను ఆశించక పరమేశ్వరుని పొందటమే లక్ష్యంగా జీవిస్తారు. ముక్తిని, జన్మరాహిత్యాన్ని పొందగోరతారు.

ముక్తి అంటే సమస్త దుఃఖాలనుండి విముక్తిని పొందటం. అది జన్మలేనపుడే సాధ్యం. జన్మలుంటే కొద్దో గొప్పో ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక దుఃఖాలుంటాయి. అందుకనే - "త్రివిధ దుఃఖ అత్యంత నివృత్తి రత్యంత పురుషార్థః - (సాంఖ్యదర్శనం 1-1) - త్రివిధ దుఃఖాలనుండి అత్యంత నివృత్తికొరకు యత్నించటమే పరమ పురుషార్థ" మన్నారు ఋషులు.

ఈ నిష్కామ భావననే యోగేశ్వర శ్రీకృష్ణుడు గీతోపదేశంలో నిష్కామ కర్మయోగంగా ప్రతిపాదించి వివరించాడు. గ్రంథవిస్తరణ భీతిచే ఆ విషయాల నిక్కడ వివరించలేకపోవుచున్నాము. వాటి నక్కడ చూడండి.

ఆ గీతామార్గాన్ననుసరించే వారినే నిష్కామజీవులంటారు. ఆ మార్గంలో సిద్ధినిపొందినవారు మరణానంతరం దేవయాన మార్గాన ముక్తిని పొందుతారు. దేవయాన మార్గాన్ని గురించి తదుపరి ప్రకరణంలో తెలుసుకుందాము.

**సకామ జీవులు :** కొందరిలో వివేకజ్ఞానం అంతగా వికసించదు. సామాన్య ధార్మికబుద్ధి మాత్రమే కలుగుతుంది. పూర్వజన్మలలో చేసిన పుణ్యకార్యాలవల్ల తమ కీ భోగభాగ్యాలు లభించాయనీ, మరల ఈ జన్మలోకూడా

పుణ్యకర్మల నాచరిస్తే రాబోవు జన్మలలో మరిన్ని భోగాలు లభిస్తాయని వీరు భావిస్తారు. వీలైనంత ఎక్కువగా ఇష్టాపూర్త కర్మల నాచరించి పుణ్యం మూటకట్టుకుంటారు. తోటి మానవుల అవసరాలను గుర్తించి, వారికి తగిన విధంగా దానధర్మాలు చేస్తారు. అన్నదానం, విద్యాదానం, జ్ఞానదానం, సేవాదానం మొదలైనవి చేస్తారు. ఉచిత అన్నసత్రాలు, విద్యాలయాలు, అనాథాలయాలు నిర్మిస్తారు. ప్రకృతి వైపరీత్యాలలో ప్రజల నాదుకుంటారు. అన్ని ప్రాణులు తమవంటివేనని భావించి పశుపక్ష్యాదులకునూ సాయంచేస్తారు. ఇట్టి కర్మలను పూర్తకార్యాలంటారు.

మానవులు పూర్తకార్యాలతోబాటు కొన్ని ఇష్టికార్యాలు కూడా చెయ్యాలంటాయి మన వేదశాస్త్రాలు. ఇష్టికార్యాలంటే– వేద ప్రతిపాదిత వివిధ యజ్ఞాలు – అగ్నిహోత్ర కార్యాలు. వీటివల్లా పుణ్యం లభిస్తుంది. అగ్నిహోత్రాలు వాతావరణాన్ని శుద్ధిచేసి – సంస్కరించి ఋతుచక్రాన్ని సరిచేస్తాయి. దానితో సమయానుకూల వర్షాలు పడతాయి. శీత వాత ఆతపాలు ప్రాణులకు అనుకూలంగా మారతాయి. తద్వారా ప్రాణులన్నిటికీ మేలు జరుగుతుంది. దాన ధర్మాది కార్యాలు చేసేటప్పుడు కొన్ని స్వపరభేదాలు రాగద్వేషాలు అహంకారాభిమానాలు కలిగే అవకాశం ఉంది. దానితో కొంత అధర్మంకూడా జరుగవచ్చు. ఇట్టివి అగ్నిహోత్ర కార్యంలో జరుగవు. కనుకనే యాజ్ఞవల్క్య మహర్షి శతపథబ్రాహ్మణం (7–1–5)లో **"యజ్ఞోవై శ్రేష్ఠతమం కర్మ – యజ్ఞం** (అగ్నిహోత్రం) అన్నిటికన్న ఉత్తమకర్మ" అన్నాడు. ఇంతేగాక, అగ్నిహోత్రం మనకు ఒక చక్కటి మౌన సందేశాన్నిస్తుంది.

మీరు కూడా నావలె పక్షపాతంలేకుండా పరోపకారం చెయ్యమంటుంది. 'స్వాహా' కారంతో త్యాగభావాన్ని పెంచుకోమంటుంది. **'ఇదం న మమ'** అనే మాటలలో ఇది నాదికాదు పరమేశ్వరునిది. పరమేశ్వరుడిచ్చిన దానినే తిరిగి అతని కర్పిస్తున్నాను అనే భావం ఉంది. ఈ మాటలు మనలో అహంభావాన్ని రాకుండా చేస్తాయి. ఈ విధంగా అగ్నిహోత్రం మనకు జీవనకళను నేర్పే పాఠశాలగా ఉంటుంది. ఈ విషయాలను వివరంగా తెలుసుకోగోరేవారు మా ప్రచురణ **'అగ్నిహోత్ర – ఆధ్యాత్మిక స్వరూపము'** చదువగోరుచున్నాము.

నిష్కామ సకామ జీవులిరువురు సత్కర్మలు చేస్తారు. అయితే, ఈ యిరువురిలో ఉన్న భేదమేమంటే - నిష్కామజీవులు సత్కర్మలవల్ల వచ్చే పుణ్యాన్ని - తద్వారా లభించే భౌతిక సుఖాలను ఆశించరు. అది ధర్మంగా కర్తవ్యంగా భావించి నిష్కామంగా కర్మల నాచరిస్తారు. సకామ జీవులు సత్కర్మల ఫలాన్ని - భౌతిక సుఖాలను ఆశిస్తారు. సకామ జీవులు మరణానంతరం పితృయాన మార్గాన్ననుసరిస్తారు? ఆ వివరాలు తదుపరి ప్రకరణంలో తెలిసికొందాము.

**3. జాయస్వ మ్రియస్వ జీవులు :** పై రెండు వర్గాలలోనికి చేరనివారంతా ఈ వర్గంలోకి వస్తారు. వీరు ఒక జన్మ తరువాత మరియొక జన్మ ఎత్తుతూనే ఉంటారు. వీరిని గురించి ఛాందోగ్యోపనిషత్తు ఏమంటుందంటే - "**తా నీమాని క్షుద్రాణ్యసకృదావర్తీని భూతాని భవంతి జాయస్వ మ్రియస్వేత్యేత తృతీయం స్థానం** (5-10-8)" అంటుంది. వీరంతా ఆహార నిద్రా భయ మైథునాలవరకే పరిమితమై ఉంటారు. విత్తేషణ దారేషణ లోకేషణలలోనే వారి జీవితాలు గడచిపోతూవుంటాయి. ఆ ప్రయత్నాలు ధర్మమార్గాన జరిగితే అభ్యుదయం కలుగుతుంది. ఈ జన్మలో ఉన్నతిని, అనంతరం ఉత్తమ మానవ జన్మను పొందుతారు. దీనికి భిన్నంగా ఆ ప్రయత్నం అధర్మమార్గాన జరిగితే క్రిమికీటకాది నీచయోనులలోకి వెళ్ళిపోతారు. ఒక జన్మ తరువాత మరొక జన్మ వెనువెంటనే పొందుతారు. కనుకనే వీరిని జాయస్వ మ్రియస్వజీవు లన్నారు. వీరి గతిని గురించి ఒక ఋషి ఏమంటారంటే-

"తద్యథా తృణజలాయుకా తృణస్యాంతం గత్వాఽన్య మాక్రమమాక్రమ్యాత్మాన ముపసంహరతి ; ఏవమేవా యామాత్మేదం శరీరం నిహత్య, అవిద్యాం గమయిత్వా, అన్యమాక్రమమా క్రమ్యాత్మానముపసంహరతి"

"ఏ విధంగా తృణ జలాయుకా=గడ్డిపురుగు ఒక గడ్డిపోచ చివరకు చేరుకొని కాళ్ళుచాచి రెండవ గడ్డిపోచను గట్టిగా పట్టుకున్న తరువాతనే మొదటి గడ్డిపోచను పూర్తిగా వదలి ముందుకు సాగుతుందో - అట్లే, జీవాత్మ క్రొత్త శరీరరూప గడ్డిపోచను పట్టుకుని ప్రాత శరీరరూప గడ్డిపోచను వదులుతుంది" అంటాడు.

ఇది ఒక ఆలంకారిక వర్ణన మాత్రమే. సరిగా ఈ విధంగానే

జరుగుతుందన టానికి వీలులేదు. ఒక్కొక్కసారి జీవాత్మ ముందు గాలిలోనికి, అక్కడినుండి మేఘాలలోనికి అనంతరం వర్షంద్వారా భూమికి – ఓషధులలోనికి (ధాన్యాలలోనికి) అనంతరం ప్రాణుల శరీరంలోనికి చేరవచ్చు.

లోకంలో దేవయానమార్గులు చాలా చాలా అరుదుగా కోటికొకరు ఉంటారేమో! అట్లే, పితృయాన మార్గులును చాలా అరుదు. సాధారణ మానవులే ఎక్కువ. అందుచేతనే, ఈ లోకము ఖాళీకాదు. ఎప్పుడూ జీవకోటితో నిండుగా ఉంటుంది. ఇక మనం దేవయాన పితృయాన మార్గాలగురించి తెలిసికొందాము.

## దేవయాన పితృయాన మార్గాలు

మన ఆధ్యాత్మిక శాస్త్రాలలో అక్కడక్కడ దేవయాన పితృయాన మార్గాల ప్రసంగం కనబడుతుంది. ముఖ్యంగా ఉపనిషత్తులలో యిది ఉంటుంది. భగవద్గీతలోనూ ఈ ప్రసంగం ఉంది. దేవయాన మార్గంలో పయనించినవారు ముక్తిని పొందుతారనీ తిరిగి ఈ లోకానికి రారనీ; పితృయానమార్గంలో పయనించినవారు కొంతకాలం సుఖాల ననుభవించి తిరిగి ఈ లోకానికి వచ్చి జన్మిస్తారనీ చెప్పబడింది. దీనిపై పెద్దగా విద్వాంసుల వ్యాఖ్యానాలుగానీ వివరణలు గానీ కనబడవు. సంక్షిప్తంగా అక్కడక్కడ ఉన్నా అవి సామాన్య ప్రజలకు అర్థమయ్యేటట్టు లేవు. చాలా కాలం నా కీవిషయాలు అర్థంకాలేదు. అయిదు సంవత్సరాల క్రిందట 'ఆర్యజీవన్' మాస పత్రిక (15-1-2006) లో వారణాసి పాణిని కన్యా మహా విద్యాలయ ఆచార్యణి సుశ్రీ సూర్యాదేవీ చతుర్వేదా గారి "వేదోంమే బతాయే జీవాత్మాకే బారహ్ (12) దిన్" అనే వ్యాసం చదవటం తటస్థించింది. అప్పు డీ విషయం కొంత అవగాహన అయ్యింది. దానిపై మనన చింతనలు చెయ్యగా మరికొంత అర్థమయ్యింది. దానినే యిచ్చట వివరించ యత్నిస్తాను.

## దేవయాన మార్గం

దేవయాన మార్గమంటే మరణానంతరం దేవతలు పయనించే మార్గం. పూర్వ ప్రకరణంలో చెప్పబడిన నిష్కామజీవులనే ఇచట దేవతలని పేర్కొనబడింది. అట్టి దివ్యగుణాలతో సిద్ధిని పొందినవారు ప్రారబ్ధం పూర్తైన

తరువాత స్వేచ్ఛగా తమ భౌతికశరీరాన్ని వదలిపెట్టగలుగుతారు. యోగస్థులై పరమేశ్వర ధ్యానమగ్నులై శరీరాన్ని వదలిపెడతారు. స్థూల శరీరాన్నేకాక క్రమంగా సూక్ష్మ కారణ శరీరాలను కూడా వదలిపెడతారు. భూలోక భువర్లోక స్వర్లోకాలను దాటి క్రమంగా పరమేశ్వరుని తృతీయ ధామానికి చేరుకొంటారు. అచట వారు అవ్యాహితగతితో (ఏ అడ్డంకి లేకుండా) స్వేచ్ఛగా విహరిస్తారు. ఆ స్థితిని వేదం ఈ విధంగా వర్ణిస్తుంది.

**"యత్ర దేవా అమృతమానశానాః తృతీయే ధామన్ అధ్యైరయన్త ॥**

యజుర్వేదం (32-10)

అచట ఆ తృతీయధామంలో ముక్తపురుషులు పరమేశ్వరుని ఆనందామృతాన్ని గ్రోలుతూ స్వేచ్ఛగా విహరిస్తా" రంటుంది వేదం.

నిష్కామ కర్మతోను, తపస్సుతోను శుద్ధులైన జీవులు అష్టాంగ యోగసాధనలో పురోగతిని సాధించ గలుగుతారు. యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహారాలలో సిద్ధిని పొంది పట్టుదలతో ధారణా ధ్యాన సమాధుల నభ్యసిస్తారు. సమాధిలోనూ కొన్ని అంతరాలుంటాయి. క్రమంగా వాటి నధిగమిస్తూ 'అసంప్రజ్ఞాత సమాధి' స్థితికి చేరుకుంటారు. అప్పుడు వారికి ఆత్మపరమాత్మల సాక్షాత్కారమౌతుంది. జీవులైన వారు తమను తాము చక్కగా దర్శించగలుగుతారు - చూసుకోగలుగుతారు. అనంతరం తమలో వ్యాపించియున్న పరమాత్మను దర్శించగలుగుతారు. అప్పుడు కలిగే ఆనందం మాటలలో వర్ణించలేనంత ఉన్నతంగా ఉంటుందంటారు ఋషులు. అట్టి ఆనందానుభవాన్ని పొందటమే 'సమాధి సిద్ధి' అంటారు. అట్టివారే దేవయాన మార్గంలో పయనించి తృతీయధామానికి చేరుకోగలరు.

ఈ శరీరంతో సమాధి సిద్ధిని పొందినా - ఈశ్వరానందానుభవాన్ని పొందినా అది క్షణికంగానే ఉంటుంది. కొన్ని నిముషాలు లేదా కొన్ని గంటలు లేదా కొన్ని దినాలు మాత్రమే ఉంటుంది. తదుపరి ఉత్థానస్థితి - సామాన్యస్థితి వస్తుంది అప్పుడు ఆకలిదప్పికలు శీతోష్ణాలు బాధిస్తాయి అయినప్పటికి వారు వాటిని నిర్లిప్తంగా ఉంటూ - సాక్షీభూతులుగా ఉంటూ అనుభవిస్తారు. ప్రారబ్ధం

పూర్తయిన తరువాత స్వేచ్ఛగా శరీరాన్ని వదలిపెడతారు. ప్రారబ్ధం అంటే ఏ ఏ కర్మల ఫలాన్ని అనుభవింప చేయటానికి పరమేశ్వరుడు ఈ శరీరాన్ని రచించాడో ఆ సుఖదుఃఖభోగాన్ని ప్రారబ్ధం అంటారు.

సమాధిస్థితినుండి ముక్తిస్థితికి చేరుకునే దానినే దేవయానం అంటారు. అది సామాన్య ప్రభాత ప్రకాశం నుండి కోటి సూర్యసమ ప్రకాశానికి చేరుకోవటం వంటిది. మంద ప్రకాశం నుండి ఒకేసారి అనంత ప్రకాశానికి చేరటం కష్టం. అంచెలంచెలుగా చేరడమే అనుకూలం. ఆ అంచెలు 12గా ఉంటాయంటుంది వేదం. 12 పూర్ణత్వ సూచకం. 12 రాశులతో ఒక వలయం పూర్తవుతుంది. 12 నెలలతో ఒక సంవత్సరం పూర్తవుతుంది. అట్లే, ఈ ప్రయాణం 12 అంచెలలో పూర్తవుతుంది. వేద మేమంటుందంటే -

**సవితా పథమే అహన్, అగ్నిర్ ద్వితీయే,**
**వాయుస్తృతీయే, ఆదిత్యశ్చతుర్థే, చన్ద్రమాః పఞ్చమ**
**ఋతుః షష్ఠే, మరుతః సప్తమే, బృహస్పతిరష్టమే,**
**మిత్రో నవమే, వరుణో దశమ, ఇన్ద్ర ఏకాదశే**
**విశ్వేదేవా ద్వాదశే ॥** - యజుర్వేదం (39-6)

సామాన్యంగా సంస్కృతంలోని 'అహన్' పదం దినాన్ని సూచిస్తుంది. కాని, యిక్కడ ఇది ప్రారంభాన్ని సూచిస్తుంది. నిఘంటువులో 'ఉష'కు గల 16 నామాలలో 'అహనా' ఒకటి. (అహన్ స్త్రీ లింగంలో అహనా అవుతుంది) ఆచార్యా సూర్యాదేవీ చతుర్వేదాగారు ఈ మంత్రాన్ని దేవయాన పరంగా వ్యాఖ్యానిస్తూ ఈ విధంగా వివరించారు.

" ఈ మంత్రంలో వచ్చే సంఖ్యావాచక శబ్దాలు ముఖ్యంగా అవస్థను, స్థితిని తెలుపుతాయి. సంఖ్యలు గౌణములు. ఈ మంత్రంలోని 12 పూర్ణతను తెలుపుతుంది. పూర్ణదశను 'సంవత్సర' మంటారు. **'పూర్ణ ఏష యత్ సంవత్సరః '** అని జైమినీయ బ్రాహ్మణం (2-39). **"సంవత్సరస్య ప్రతిమా వై ద్వాదశః "** అంటుంది తైత్తరేయ బ్రాహ్మణం (1-1-67). అంటే, సంవత్సరం పూర్ణాన్ని సూచిస్తుంది. అది 12 భాగాలుగా విభజింపబడింది. ఈ అధ్యాయంలోని

'అహన్' శబ్దం ప్రారంభాన్ని సూచిస్తుందికాని దినాన్ని కాదు. ఉషఃకాలాన్ని అహన్ (అహన్ ఇతి ఉషానామ) అని నిఘంటు (1-8) వంటుంది. ఏ విధంగా ఉషఃకాలం దినంలోని ఒక భాగమైనా దినంయొక్క ప్రారంభాన్ని, దశను, స్థితిని తెలుపుతుందో, అట్లే మరణానంతరం ముముక్షువైన యోగి (జీవుడు) అతని కర్మల ననుసరించి ఏఏ స్థితులను పొందుతాడో వాటిలో 'అహన్' ఆరంభదశకు వాచకమని గ్రహించాలి. ఈ మంత్రంలోని సవిత, అగ్ని, వాయు మొదలైన పదములు బ్రహ్మవేత్తయైన జీవుడు మరణానంతరం పొందే వివిధ ఆనందస్థితులను తెలుపుతాయి. వాటి పూర్ణత్వం 12 భాగాలలో ఉంటుంది.

1. **సవితా ప్రథమే అహన్** = ముందుగా (శరీరం మరణించిన వెంటనే) యోగి 'సవితా' అనబడే ఆనందస్థితిని పొందుతాడు. ఇది ఎలా ఉంటుందంటే - సూర్యోదయ పూర్వకాలం (ఉషఃకాలం)వలె ఉంటుంది.

2. **అగ్నిర్ ద్వితీయే** = సవితా దశ తదుపరిది అగ్నిదశ. ఈ దశలో మొదటికన్న మరికొంత ఎక్కువ ఆనందాన్ని, జ్ఞానాన్ని పొందుతాడు.

3. **వాయుస్ తృతీయే** = అనంతరం వాయుదశ. అంటే అతి సూక్ష్మతత్త్వాలను తెలుసుకోగల వివేకాన్ని లేదా అట్టి శక్తిని పొందుతాడు.

4. **ఆదిత్యశ్చతుర్థే** = నాల్గవది ఆదిత్యదశ, ఈ దశలో సూర్యసమానమైన తేజోమయ విశిష్ట ప్రకాశానందం కలుగుతుంది.

5. **చన్ద్రమాః పఞ్చమే** = ఐదవది చన్ద్రమాః దశ. చంద్రునితో పోల్చతగిన ఆనందదశ ఇది. ఈ దశలో జీవునిలో ఆనందమే ఆనందం ఉంటుంది. (చది-ఆహ్లాదే).

6. **ఋతుః షష్ఠే** = అనంతరం క్రమంగా ఋతుస్థితి వస్తుంది. ఈ స్థితిలో పూర్వపు స్థితులకన్న విస్తృత ప్రకాశమాన ఆనందం కలుగుతుంది. ఈ విస్తృత ఆనందస్థితిలో మూడు ఋతువులతో కూడిన ఉత్తరాయణ సూర్యప్రకాశం వంటి స్థితి కలుగుతుంది.

7. **మరుతః సప్తమే** = అటుపిమ్మట మరుత్‌స్థితి కలుగుతుంది. అంటే-

విద్యుత్‌తో (మెరుపుతో) కూడిన పర్షణశీల కిరణములపూదిరి ఆనందము యొక్క ఉన్నత స్థితి కలుగుతుంది.

8. బృహస్పతి రష్టమే = తదుపరి 'బృహస్పతి' నామక ఆనందం జీవునకు ప్రాప్తిస్తుంది. ఆ బృహస్పతిదశ మూడు లోకాలలో వ్యాపించియున్న సూత్రాత్మ వాయువు వంటిది.

9. మిత్రో నవమే = బృహస్పతిదశ అనంతరం కల్మషరహిత మిత్ర = శాన్తదశ వస్తుంది. 'మిత్రో వై శాంతిః" అంటుంది కాఠసంహిత (35-19).

10. వరుణో దశమే = అనంతరం సర్వోచ్ఛాదిత నిర్భయతా దశను ముముక్షువైన జీవుడు ప్రాప్తిస్తాడు.

11. ఇన్ద్ర ఏకాదశే = వరుణస్థితి తదుపరి ఇంద్రదశ వస్తుంది. ఈ దశలో ఆనందస్వరూప పరమాత్మని గుణాలతో యుక్తుడౌతాడు. బ్రహ్మతో కలయిక జరుగుతుంది. జ్ఞాన ఆనందరూప ఐశ్వర్యాలతో నిండిపోతాడు.

12. విశ్వేదేవా ద్వాదశే = చివరగా విశ్వేదేవాః స్థితి వస్తుంది. ఈ 12 దశాపూర్ణతను తెలుపుతుంది. "సర్వం వై విశ్వేదేవాః' అంటుంది శతపథ బ్రాహ్మణం (1-7-4-22). అంటే - ఈ దశలో జీవుడు (ముక్తాత్మ) బ్రహ్మసాక్షాత్కారరూప ఆనందంలో మగ్నుడౌతాడు.

క్రమంగా ఈ 12 స్థితులను పొందిన జీవుడు ఆనందస్వరూప పరమాత్మలో స్వేచ్ఛగా విహరిస్తాడు. ఈ క్రమపూర్వక ఆనందాన్ని పొందటానికి జీవుడు సూర్య చంద్రాది భౌతిక గోళాలలోనికి వెళ్ళనక్కరలేదు. ఎందుచేతనంటే పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు కదా! అట్లే బ్రహ్మానందమును సర్వవ్యాపకమే కదా !

ఇంతవరకు తెలుసుకున్నది ఈశ్వరీయ జ్ఞానమైన వేదం చేప్పే దేవయాన మార్గం. ఋషులు ఈ 12 అంచెల మార్గాన్ని పేర్ల మార్పుతోను, అంచెల సంఖ్య మార్పుతోను ఉపనిషత్తులలో అక్కడక్కడ వర్ణించడం జరిగింది. ఛాందోగ్యోపనిషత్తులో రెండు చోట్ల ఈ ప్రసంగం కనబడుతుంది.

**1. అథ యదు చైవాస్మిఞ్ ఛవ్యం కుర్వంతి యదిచ నార్చిష మేవాభి**

సంభవం త్యార్చిషో౽హరహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణ పక్షాద్ యాన్ షడుదఙ్ఙేతి మాసాం స్తాన్, మాసేభ్యః సంవత్సరం, సంవత్సరా దాదిత్యమాదిత్యాచ్చంద్రమసం, చంద్రమసో విద్యుతం తత్ పురుషో౽మానవః।

(చాందోగ్య 4-15-5)

**2. తద్ య ఇత్థం విదుః యే చేమే౽రణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే తే౽ర్చిష మభిసంభవం త్యర్చిషో౽హరహ్న ఆపూర్యమాణ పక్ష మాపూర్యమాణపక్షాద్యాన్ షడుదఙ్ఙేతి మాసాం స్తాన్ ॥**

**మాసేభ్యః సంవత్సరం, సంవత్సరాదిత్య మాదిత్యా చ్చంద్రమసం, చంద్రమసో విద్యుతం తత్ పురుషో౽మానవః స ఏతాన్ బ్రహ్మ గమయిత్యేష దేవయానః పంథా ఇతి**

(ఛాందోగ్య 5-10-1,2)

దేవయాన పథాన్ని గూర్చిన పై ఋషివాక్యాలను మాతా సూర్యాదేవీ చతుర్వేదా గారు ఈ విధంగా వివరించారు-

"పై ఉపనిషత్ వచనాలలో బ్రహ్మవిత్ జ్ఞానియొక్క మరణానంతర దశలు ప్రతిపాదించబడ్డాయి. ఆ దశ లీవిధంగా ఉంటాయి- అర్చిషమ్ - అర్చిషీ, అహః = అహ్నికీ, ఆపూర్యమానపక్షం = శుక్లపక్షం, ఉదజ్ = ఔత్తరాయణీ, షణ్మాసకీ, సంవత్సరమ్ = వార్షికీ, ఆదిత్యమ్ = సౌరీ, చన్ద్రమసమ్ = చాన్ద్రమసీ, విద్యుతమ్ = వైద్యుతీ, అనంతరం అమానవః=బ్రాహ్మీ మౌక్తీ దశలను క్రమంగా పొందుతాడు.

పై ఉపనిషద్ వచనాలలోని అర్చిః, అహన్ పదములకు లోకప్రసిద్ధ అగ్ని దినములని అర్థంకాదు. ఆ పదములు కేవలం ఒక్కొక్క దశను సూచిస్తాయి. ఎలాగైతే జ్ఞానవంతునకు (బుద్ధిమంతునకు) బాల్యావస్థలో ఏ ఆనందం కలుగుతుందో దానికన్న చదువుచున్నపుడు, మననం చేస్తున్నప్పుడు మరియు సమాధ్యవస్థ (ధ్యానావస్థ)లోను ఉత్తరోత్తరం ఆనందం పెరుగుతుందో అట్లే - శరీరం వదలిన తదుపరి జ్ఞానవంతుడైన జీవునకు ఉత్తరోత్తర ఆనందం వృద్ధిచెందుతుంది. అట్టి ఉత్తరోత్తర ఆనందవృద్ధినే 'అహన్' మొదలైన పదములద్వారా వర్ణించటం జరిగింది. అందుచే జ్వాలా, దినము మొదలైన

పదముల రూఢి అర్థాలను ఇచ్చట గ్రహించకూడదు. ఒకవేళ రూఢ్యర్థాలనే యిక్కడ తీసుకుంటే సరిగా కలపదు. ఎందుచేతసంటే – ఆదిత్యుని తరువాత చంద్రుని ప్రాప్తిస్తాడని వేదంలోనూ ఉపనిషత్తులలోనూ చెప్పబడింది కదా! అది ఇక్కడ పొసగదు. చంద్రుని తరువాతనే కదా సూర్యుడుంటాడు. రూఢ్యర్థం గ్రహించాలంటే ముందు చంద్రుని తరువాత సూర్యుని ప్రాప్తిస్తాడని చెప్పవలసి ఉంటుంది. అందుచేత ఈ మంత్రంలోని, ఋషి వాక్యాలలోని పదములు ఆయా ప్రదేశాలనుకాక ఆయా అవస్థలను స్థితులను తెలుపుతున్నాయని గ్రహించాలి.

ఈ వేదమంత్రం సూర్యదశకన్న చంద్రదశ ఎక్కువ ఉన్నతమైనదీ ఆహ్లాదకరమైనదీ నని చెబుతోంది. ఈ దశలో జీవునకు, ఆనందమే ఆనందం కలుగుతుంది (చది–ఆహ్లాదే). ఇచట సూర్య చంద్ర పదములు గుణవాచకములేకాని స్థానవాచకములు కావు. సూర్యుని తాపము కొన్ని వేళలలో మనకు బాధను కలిగించవచ్చుకానీ చంద్రప్రకాశము ఎప్పుడూ ఎవరికీ బాధను కలిగించదు. ఆహ్లాదాన్నే కలిగిస్తుంది.

అట్లే, దేవయాన మార్గంలో పయనించే జీవునకు ఆదిత్యదశ తదుపరి చంద్రదశ కలిగి ఆనందమే ఆనందం కలిగి తన్మయుడౌతాడు. దుఃఖ మేమాత్రం ఉండదు.

జీవునకు కలిగే అర్చిషీదశ ఎటువంటిదంటే శరీరం మరణించినవెంటనే అగ్ని జ్వాలతో పోల్చతగిన బ్రహ్మజ్ఞానం అతనికి కలుగుతుంది. లేదా దానిని ఆనందప్రకాశ మనియు అనవచ్చు. అహ్నికీదశ అర్చిషీదశకన్న ఎక్కువ ఆనందప్రదమైనది. ఈ అధికత ఎటువంటిదంటే– పగటి వెలుతురుకు అగ్నిజ్వాలాప్రకాశం తోడైనట్లు అధికమౌతుంది. ఆపూర్యమాణదశ (శుక్లపక్షదశ) అహ్నికీ దశకన్న ఎక్కువ ఆనందప్రదమైనది. ఈ అధికత ఎటువంటిదంటే– శుక్లపక్ష చంద్రప్రకాశం పెరుగుతూ పెరుగుతూ పౌర్ణమి రోజున పూర్ణత్వాన్ని పొందినట్లు ఆనందం క్రమక్రమంగా వృద్ధిచెందుతూ వుంటుంది. ఉదగ్‌దశ ఆపూర్యమాణదశకన్న ఉన్నతమైనది. ఈ ఉన్నతి ఎటువంటిదంటే– శుక్లపక్షం కన్న 6 నెలల అవధితోకూడిన ఉత్తరాయణం పెద్దదైనట్లు.

సంవత్సరదశ ఉదబ్‌దశకన్న బృహత్తరమైనది (గొప్పది). ఎట్లంటే- 6 నెలల ఉత్తరాయణం కన్న సంవత్సరం పెద్దదైనట్లు. ఈ దశలో మరింత ఆనందం కలుగుతుంది. ఈ సంవత్సరదశకన్న ఆదిత్య-సౌరాదశ బృహత్తరమైనది. ఎట్లంటే- సంవత్సరం కన్న సంవత్సరకర్తయైన ఆదిత్యుడు గొప్పవాడు కదా ! ఆదిత్యదశను పొందిన అనంతరం ముముక్షువు (జీవుడు) చాంద్రమాసీదశను పొందుతాడు. ఆ దశ మరింత ఆనందాన్నీ ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. అక్కడనుండి జీవుడు విద్యుతీదశకు చేరుకుంటాడు. ఆ దశలో జీవుడు అపారమైన ఆనందాన్ని పొందుతాడు. ఆ అపారం ఎటువంటిదంటే- విద్యుత్ ప్రకాశాప్రకాశక రూపంలో సృష్టిలోని పదార్థాలన్నిటిలోను అపారంగా ఉన్నట్లే – జీవునకు సీమాతీత ఆనందం కలుగుతుంది. ఈ దశ జీవులు చేసిన పుణ్యకర్మల ఫలరూపంగా కలుగుతుంది. విద్యుతీదశనుండి బ్రహ్మవేత్తయైన యోగి అమానవః దశను పొందుతాడు. అతడు అమానవుడౌతాడు' అంటే – ముక్తు డౌతాడు." అని మాతాజీ వివరించారు.

బృహదారణ్యకోపనిషత్తులో (పంచమాధ్యాయ పదియవ బ్రాహ్మణంలో) ఈ దేవయాన మార్గం చాలా సంక్షిప్తం చేసి చెప్పబడింది. మొదట వాయు లోకానికి అనంతరం ఆదిత్యలోకానికి తదుపరి చంద్రలోకానికి అక్కడనుండి నేరుగా శోకరహితమైన ముక్తిధామానికి చేరుకుంటాడని చెప్పబడింది. జగత్ప్రసిద్ధమైన భగవద్గీత దేవయానమార్గాన్ని మరొక పద్ధతిలో చెబుతుంది.

**"శ్లో॥ అగ్నిర్జ్యోతి రహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।**

**తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥** – భగవద్గీత (8-24)

అగ్ని – జ్యోతి – దినము – శుక్లపక్షము – 6 నెలలుగల ఉత్తరాయణము ఈ మార్గమున ప్రయాణము చేసిన బ్రహ్మవేత్తలైన యోగులు బ్రహ్మను (ముక్తిని) పొందుచున్నా" రంటుంది.

మనం ముందుగా తెలుసుకున్న యజుర్వేదమంత్రంలోని 12 దశల దేవయాన మార్గాన్నే ఉపనిషద్ ఋషులు వారి వారి శైలిలో సంక్షిప్తంచేసి చెప్పడం జరిగింది. దశలపేర్లు కూడా అట్లే మార్పుచేసి చెప్పబడ్డాయి. మార్గం

మాత్రం అదే.

వేదమంత్రాన్ని పొరబాటుగా అర్థంచేసుకునే పౌరాణికులు మరణానంతర ద్వాదశాహ కర్మకాండను కల్పించారు. మరణించిన పెద్దలంతా ఈ 12 అంచెల మార్గంలో పయనిస్తారనీ, అందుకు 12 దినములు కర్మకాండ చెయ్యవలసి వస్తుందనీ భావించి దీనిని కల్పించారు. కాని, ఆ కర్మకాండలో వారు చదివే మంత్రాలకు (వాటి అర్థాలకు) వారు చేసే క్రియలకు ఏ మాత్రం పొంతనవుండదు. మంత్రార్థం ఒక రకంగా ఉంటే వారు చేసే క్రియ మరొకరకంగా ఉంటుంది. అయినా, వేదజ్ఞానం లేని పండిత పామరులంతా అది వైదిక పద్ధతియేనని నమ్ముతున్నారు. వివేకవంతులు ఆలోచించి దీనిని సరిచెయ్యవలసి ఉంది. ఇక, ముక్తి అంటే ఏమిటి ? కేవలం ఆనందంలో పడి ఉండటమేనా ? మరేమైనా గతి, ప్రగతి ఉంటుందా ? తెలుసుకుందాము.

## ముక్తి స్వరూపం

ముక్తిని గురించి లోకంలో రకరకాల అభిప్రాయాలున్నాయి. జైనులు మరణానంతరం శివపురికి పోయి అక్కడ మోక్షశిలపై ఏ వ్యాపకం లేకుండా కూర్చోవటాన్ని ముక్తి అంటారు. బౌద్ధులు కేవలం జన్మరాహిత్యాన్నే ముక్తి అంటారు. మహాత్మా బుద్ధు దేమంటాడంటే – 'మరణానంతరం జీవుని అస్తిత్వం ఉందా? లేదా? సృష్టి పరిమితమా ? అనంతమా ? భౌతిక శరీరానికి చైతన్యానికి గల సంబంధం ఏమిటి ? అనే ప్రశ్నలకు సమాధానాలు లభించటం కష్టం కనుక వాటిమీద వాదోపవాదాలు చెయ్యటం వ్యర్థం. మరణానికి ముందే మానవుడు అంతర్ముఖుడై – ధ్యానమగ్నుడై మరణ పునర్జన్మలు లేని ఆనందమయ స్థితిని సాధించడమే నిర్వాణం, అదేముక్తి" అన్నాడు.

క్రైస్తవులు నాల్గవ ఆకాశంలోని యహోవా దేవుని దగ్గరకు చేరుకొని అక్కడ విశేష సుఖాలనుభవించటాన్ని ముక్తి అంటారు. మహ్మదీయులు ఏడవ ఆకాశంలోని తమ అల్లా దేవుని దగ్గరకు చేరుకోవటాన్ని ముక్తి అంటారు. ఇలాగే వామ మార్గులు శ్రీపురాన్నీ, శైవులు కైలాసాన్ని, వైష్ణవులు వైకుంఠాన్ని, గోకులపు గోసాయిలు గోలోకాన్ని చేరుకోవటాన్ని ముక్తిగా భావిస్తారు.

ఇక్కడకన్న అక్కడ విశేష సుఖాలుంటాయని వారినమ్మకం. పౌరాణికులు అయిదురకాల ముక్తి ఉంటుందంటారు. అవి (సాలోక్యం) ఈశ్వరుని లోకంలో నివసించటం, (సానుజ్యం) తమ్మునివలె ఈశ్వరుని చెంత ఉండటం, (సారూప్యం) ఈశ్వరునితో సమానమైన ఆకృతి పొందటం, (సామీప్యం) సేవకునివలె సమీపంలో ఉండటం. (సాయుజ్యం) ఈశ్వరునితో సంయుక్తుడై ఉండటం. ఈ అయిదు రకాలుగా ముక్తి ఉంటుందంటారు. ఇక, అద్వైతులు తమ అస్తిత్వాన్ని పోగొట్టుకోవటమే ముక్తి అంటారు. నీటి బిందువు సముద్రంలో పడి సముద్రమైపోయినట్లు జీవాత్మ పరమాత్మలో కలిసి పరమాత్మ అయిపోతుందట!

కాని, పై వేవీ ముక్తులు కావు. ఈశ్వరీయజ్ఞానమైన వేదం వీటినేటినీ అంగీకరించదు. జీవాత్మ స్థూల సూక్ష్మ కారణ శరీరాలనన్నిటిని పొగొట్టుకొని స్వసామర్థ్యంతో అవ్యాహత గతితో (అడ్డులేని గతితో) స్వేచ్ఛగా ఈ విశాల విశ్వంలో విహరించటాన్ని ముక్తి అంటుంది. ఆ విధంగా విహరిస్తూ అత దే పదార్థజ్ఞానం పొందగోరితే ఆ జ్ఞానాన్ని పరమేశ్వరుడిస్తాడు. తోటి ముక్తాత్మల సాంగత్యమూ ఉంటుంది. వారి నుండి కొంత జ్ఞానాన్ని గ్రహిస్తాడు. ఎంతెంతగా అతని జ్ఞానం పెరుగుతుందో అంతంతగా ఆ ముక్తాత్మకు ఆనందం పెరుగుతుంది. అతనికి త్రివిధ శరీరాలు లేకపోయినా -

**శృణ్వన్ శ్రోత్రం భవతి, స్పర్శయన్ త్వగ్భవతి,**
**పశ్యన్ చక్షుర్భవతి, రసయన్ రసనా భవతి**
**జిఘ్రన్ ఘ్రాణం భవతి**
**మన్వానో మనో భవతి, బోధయన్ బుద్ధిర్భవతి**
**చేతయం శ్చిత్తం భవ త్యహం కుర్వాణో౽హంకారో భవతి ।**

– శతపథ బ్రాహ్మణం (14వ కాండం)

వినవలసినపుడు శ్రోత్రరూపుడు, స్పృశింపవలసినపుడు త్వగ్రూపుడు, చూడవలసినపుడు – చక్షురూపుడు, రుచి చూడగోరిన రసనాస్వరూపుడు, వాసన చూడగోరిన ఘ్రాణస్వరూపుడు, ఆలోచించగోరిన మనఃస్వరూపుడు,

తెలుసుకోగోరిన బుద్ధిస్వరూపుడూ... నై సంకల్పమాత్రం చేత వాటిని గ్రహించగలుగుతాడు. ఇటువంటివే మొత్తం 24 శక్తులు కలిగి ఉంటాడని మన ప్రాచీన ఋషులంటారు. వివరాలకు మహర్షి దయానంద విరచిత సత్యార్థ ప్రకాశంలో నవమ సముల్లాసం చూడండి.

ఈ శక్తులన్నీ సృష్టిలోని జ్ఞానాన్ని పొందటానికేకాని విషయభోగాలనుభవించటానికి కాదు. భోగవాంఛ గలవాడు ముక్తుడే కాలేడు కదా !

పై విధంగా 31104000 కోట్ల సంవత్సరాలు జ్ఞానానందాల ననుభవించి తిరిగి ఈ లోకానికి వచ్చి సామాన్య మానవునిగా జన్మిస్తాడు. మరల ముక్తిని పొందాలంటే ప్రారంభంనుండి సాధన చేయవలసిందే. ముక్తిపొందినవారు తిరిగి రారని కొందరంటారు. కాని, యిది సత్యంకాదు. **"కో నో మహ్యా అదితయే పునర్దాత్ పితరం చ మాతరం చ"** అని ఋగ్వేదం (1-24-1), **'తే బ్రహ్మలోకే హ పరాంతకాలే పరిముచ్యంతి సర్వే'** అని ముండకోపనిషత్తు (2-6) చెబుతున్నాయి. ఇంతేగాక, మానవు డెంతటి గొప్ప పుణ్యకార్యాలు చేసినా, యోగాభ్యాసం చేసినా వాటి ఫలాలకు అవధి ఉంటుంది. అవధి కలిగిన కర్మలు అనంత ఫలాన్ని యివ్వలేవు. పరాంతకాలం ఆనందానుభవమంటే తక్కువేమీకాదు. 36,000 సృష్టులు 36,000 ప్రలయాలు జరిగినంత కాలం ఏ దుఃఖం లేకుండా ఆనందంగా ఉంటుంది ముక్తాత్మ. (సృష్టికాలం 432 కోట్ల సంవత్సరాలు, ప్రళయకాలమునూ 432 కోట్ల సంవత్సరాలే) అందుకనే ముక్తిపొందినవారు తిరిగి సంసారంలోనికి రారని అక్కడక్కడ చెప్పారు ఋషులు. ఇక మనం పితృయానం గురించి తెలుసుకుందాము.

## పితృయాన మార్గం

పితృయానమార్గమంటే- పితరులు ప్రయాణం చేసిన మార్గం. పూర్వం తెలిసికొన్నట్లుగా తల్లిదండ్రులు, పాలనపోషణలు చేసినవారు, విద్యాబుద్ధులు నేర్పిన వారు పితరులే. అయినా, ఇక్కడ ఈ ప్రకరణంలో పితరులంటే సకామ జీవులు. ఫలితాన్ని ఆశించి, స్వర్గాన్ని ఆశించి ఇష్టాపూర్త కర్మలను, దానధర్మాలను చేసే ధర్మాత్ములు. అట్టివారు మరణానంతరం పితృయాన మార్గాన పయనించి

కొన్ని విశేష ఆనందానుభూతుల ననుభవించి తిరిగి ఈ లోకాన జన్మిస్తారు.

వేదాలలో పితృయానాన్ని గూర్చిన మంత్రాలు కొన్ని ఉండిఉంటాయి కాని అవి నా బుద్ధికి దొరకలేదు. అందుచే ఉపనిషత్ వచనాలను తీసుకొని వివరించే ప్రయత్నం చేస్తాను.

**అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్త మిత్యుపాసతే తే**
**ధూమ మభిసంభవతి, ధూమా ద్రాత్రిం, రాత్రే రపరపక్ష,**
**మపరపక్షాద్ యాన్ షడ్ దక్షిణైతి, మాసాం స్తాన్నైతే,**
**సంవత్సర మభిప్రాప్నువంతి ॥**
**మాసేభ్యః పితృలోకం పితృలోకా దాకాశ మాకాశా**
**చ్చాంద్రమస, మేష సోమో రాజా తద్దేవానా మన్నం, తం**
**దేవా భక్షయంతి॥** - ఛాందోగ్యోపనిషత్ (5-10-3,4)

ఇక ఎవరు గ్రామాలలో పట్టణాలలో ఇష్టాపూర్తాలను - ప్రజోపయోగకార్యాలను పరమేశ్వరసేవగా భావించి చేస్తారో వారు మరణానంతరం మందప్రకాశ మార్గాన్ని అనుసరిస్తారు. అట్టి పితరులు వరసగా ధూమాన్ని, రాత్రిని, కృష్ణపక్షాన్ని, దక్షిణాయనాన్ని ప్రాప్తిస్తారు. కాని, వీరు సంవత్సరాన్ని అంటే పూర్ణత్వాన్ని పొందలేరు.

వారు 6 మాసాల నిడివిగల దక్షిణాయణాన్నుండి నేరుగా పితృలోకానికి అటనుండి ఆకాశానికి, అనంతరం చంద్రలోకానికి చేరతారు. ఆ చంద్రలోకం దేవతల కన్నము వంటిది. అక్కడ వారు సకల భోగాలను అనుభవిస్తారు.

పై ఉపనిషద్ వచనాలను మాతా సూర్యాదేవీ చతుర్వేదా గారు ఈ విధంగా విశ్లేషించారు.

"సకామ జీవులు మరణానంతరం పొందే మొదటిదైన ధూమదశ ఎటువంటిదంటే- కేవలం ప్రకాశాభాస అనుభవం మాత్రమే. ఈ దశలో నిర్భయత యింకా ప్రాప్తించదు. ధూమ్ - భయం (ధూఞ్ కమ్పనే) ఆవహించి ఉంటుంది. ధూమదశ తదుపరి రాత్రిదశ వస్తుంది. ఈ దశలో మందజ్యోతి (స్వల్ప ప్రకాశంతోకూడిన చీకటి) ప్రాప్తిస్తుంది. ఈ దశ ప్రకాశాప్రకాశముల

కలయికవలె ఉంటుంది. స్వల్ప ప్రకాశంగల రాత్రివలె ఉంటుంది. అనంతరం అపరపక్షదశ వస్తుంది. అంటే- అనుత్కృష్టదశ (అంత ఉత్కృష్టముకాని దశ). మధ్యమ జనుల దశ. ఉత్కృష్ట జనుల దశకన్న భిన్నమైన దశ. ఈ దశలో రాత్రిదశకన్న కొంత ఆనంద మెక్కువగా ఉంటుంది. దీనివల్ల కొంత సుఖం కలుగుతుంది. అనంతరం దక్షిణాయణ దశ వస్తుంది. ఇది అపరపక్షదశ కన్న కొంత ఉన్నతమైనది. ఈ దశలో పూర్వదశలకన్న కొద్ది ఎక్కువ ఆనందం కలుగుతుంది. ఈ ఎక్కువ ఎటువంటిదంటే - 15 దినముల వ్యవధితో కూడిన కృష్ణపక్షముకన్న 6 నెలలతోకూడిన దక్షిణాయనం ఎక్కువైనట్లు. ఈ దశలో ఆనందం కలుగుతుంది కాని అది పూర్ణానందంకాదు. ఈ విధంగా మధ్యమకోటికి చెందిన సకామ జీవుల గతి ఉంటుంది.

సకామ జీవులు సంవత్సరదశను పొందలేరు. అంటే పూర్ణానందాన్ని పొందలేరు. దక్షిణాయణదశ నుండి వారు పితృలోకాది దశలను కొన్ని పొంది తిరిగి జనన మరణాలతో కూడిన ఈ సంసార సముద్రంలోనికి వస్తారు" అని విశ్లేషించారు.

ఛాందోగ్యోపనిషత్తు సకామ జీవులు పితృలోకాన్నుండి వెళ్ళిన దారినే తిరిగి వస్తారంటుంది. అంటే- ఆకాశం నుండి వాయువుకు, వాయువు నుండి ధూమానికి, అటనుండి మేఘాలలోనికి, తదుపరి వర్షించినపుడు భూమిలోనికి, అనంతరం ధాన్యాలలోనికి, వీర్యంలోనికి, స్త్రీగర్భంలోనికి ప్రవేశిస్తారంటుంది.

మాతాజీ చేసిన విశ్లేషణనుబట్టి పితృయానంలోనివన్నీ అవస్థలు అనుభూతులే కాని స్థానవిశేషాలుకావు. అట్లే, చంద్రలోకమంటే ఆహ్లాదకరస్థితియేకాని ఆకాశంలో కనబడే చంద్రగోళంకాదు. అయినా మనకు కనబడే చంద్రునిపై వాతావరణమే లేదంటున్నారు వైజ్ఞానికులు. సూర్య కిరణాలు పడినచోట అత్యంత ఉష్ణంగా (550) పడనిచోట అత్యంత శీతలంగా (-250 ) ఉంటుందంటున్నారు. అటువంటిచోట ప్రాణులెట్లుంటాయి ?

ఉపనిషత్తులో చెప్పినట్లుగానే భగవద్గీత (8-25) లోనూ చెప్పబడింది-

శ్లో॥ ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనం ।
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ॥

సకామ జీవులు మరణానంతరం వరుసగా ధూమాన్ని, రాత్రిని, కృష్ణపక్షాన్ని, 6 మాసాలు నిడివిగల దక్షిణాయణాన్ని ప్రాప్తించి అనంతరం చంద్రజ్యోతిని (ఆహ్లాదాన్ని) పొందుతారు. పుణ్యఫలం క్షీణించిపోగానే వెళ్ళిన మార్గాన్నే తిరిగి వస్తారు" అంటుంది భగవద్గీత.

సంక్షిప్తంగా ఇదీ దేవయాన పితృయాన మార్గాలను గూర్చిన కథనం. ఈ రెంటిలో మనం దేవయాన మార్గాన్ననుసరించటమే ఉత్తమం. అంటే - సత్కర్మలాచరిస్తూ వాటి ఫలంగా వచ్చే పుణ్యాన్ని (భౌతిక సుఖాలను) పరమేశ్వరునకర్పించటం. జన్మరాహిత్యాన్ని ముక్తిసుఖాన్ని మాత్రమే కోరుకోవటం.

# కర్తవ్యం

ప్రియ పాఠకులారా !

మన మింతవరకు మరణానంతరం జీవుని ప్రయాణం గురించి, వైదిక కర్మ సిద్ధాంతాన్ని గురించీ, దేవయాన పితృయాన మార్గాల గురించి తెలుసుకున్నాము. వాటితోబాటు జీవులమైన మన స్వరూపం గురించి, సృష్టి స్థితి లయ కర్తయైన పరమేశ్వరుని గురించి సంక్షిప్తంగా తెలుసుకున్నాము. ఇక మన కర్తవ్యమేమిటో ఆలోచిద్దాము.

చాలా అరుదుగా మానవ జన్మ వస్తుందనీ, దానిని మనం పూర్తిగా సద్వినియోగం చేసుకోవాలనీ పెద్దలంటారు. వేద సందేశం కూడా అదే -

**ఉద్యానం తే పురుష నావయానం**
**జీవాతుం తే దక్షితాతిం కృణోమి ।**
**ఆ హి రోహేమ మమృతం సుఖం రథమ్**
**అథ జిర్వి విదథమా వదాసి** - అథర్వవేదం (8-1-6)

ఓ మానవా ! ఉత్తమ కర్మల నాచరించి ఉన్నతిని పొందు. అధమ కర్మల నాచరించి అవనతిని పొందవద్దు. నేను నీకు జీవితాన్ని, దక్షతను ప్రసాదిస్తున్నాను. ఈ ఉత్తమ సుఖకారక మానవ శరీరాన్ని అధిరోహించి అమరత్వాన్ని పొందు. నిష్కామ కర్మల నాచరించి తోటివారికి ఆదర్శప్రాయుడవు కమ్ము. యజ్ఞమయ జీవితంతో వృద్ధుడవై నీ అనుభవాలను తోటి మానవుల కందించి ఆదర్శపురుషుడవు కమ్ము.

పై పరమేశ్వర సందేశాన్ననుసరించి మనం భౌతికోన్నతితోబాటు ఆత్మికోన్నతికి యత్నించటం చాలా అవసరం. న్యాయంగా ధర్మంగా మనకు లభించిన ఆస్తిపాస్తులతో సంతృప్తిచెందాలి. ఎవరి ధనాన్ని ఆశించకూడదు. లోభులము కాకూడదు. మనకు లభించిన దానిలో కొంతభాగం పరోపకారాది పుణ్యకార్యాలకు వినియోగించి పుణ్యాత్ములము కావాలి. ఆ పుణ్యంతో మరికొన్ని ప్రాపంచిక సుఖాలు, ఉత్తమ జన్మలు లభించాలని కోరుకోవటంకన్న ముక్తిని కోరుకోవటం ఉత్తమం.

ఎందుచేతనంటే- ప్రాపంచిక భోగాల నెంతగా అనుభవించినా వాటిపై రాగం తగ్గదు. పోగా, అనుభవించేకొలది వాటిపై రాగం పెరుగుతుందంటారు ఋషులు. ఇంతేగాక, ధర్మపూర్వకంగా లభించిన భోగాల వెనుకకూడా పరిణామ తాప సంస్కార గుణవృత్తివిరోధ దుఃఖాలు దాగియుంటాయంటాడు పతంజలి మహర్షి . కనుక, బుద్ధిమంతులు వాటిపై రాగాన్ని పెంచుకోక వైరాగ్యాన్ని పెంచుకుంటారు.

సమస్త దుఃఖాలనుండి విముక్తిని కలిగించే ముక్తిని - జన్మరాహిత్యాన్ని మాత్రమే కోరుకుంటారు. పతంజలి మహర్షి చూపిన అష్టాంగ యోగమార్గాన్ననుసరిస్తారు. సాధనచేసి ఆత్మపరమాత్మల సాక్షాత్కారాన్ని పొందుతారు. మరణానంతరం దేవయాన మార్గాన పరమ పదాన్ని ప్రాప్తిస్తారు. మనమునూ ఆ మార్గాన్ని అనుసరించటమే ఉత్తమం.

ఒకవేళ మనలో అంతటి వైరాగ్యం లేకుంటే, యోగ సాధనలు చేయలేకుంటే రెండవదయిన పితృయానమార్గాన్ననుసరించటం మంచిది. ధర్మమార్గాన ధనవంతులము కావటానికి యత్నించి, ఆ ధనాన్ని సమాజసేవకు దేశసేవకు వినియోగించాలి. ధనంతో సేవించలేనివారు కొంత సమయాన్ని సమాజసేవకు వినియోగించాలి. అదీ చేయలేనివారు అట్టి అవకాశాన్ని కలిగించుమని భగవంతుని మనసారా ప్రార్థించాలి. కాని, పాపులము పాపచింతకులము హింసకులము ద్రోహులము కాకూడదు. అలా చేస్తే 'జాయస్వ మ్రియస్వ' జీవులమై మాటిమాటికి పుడుతూ చస్తూ పెక్కు బాధల నుభవించవలసి వస్తుంది.

మరణ సమయ మాసన్నమైనపుడు మోహరాగాలను ప్రక్కకుపెట్టి స్వస్వరూప చింతనలోనికి మరలాలి. 'ఓ3మ్' నామాన్ని స్మరిస్తూ సర్వవ్యాపక సర్వేశ్వరుడైన అంతర్యామి చెంతకు చేరాలి - అంతర్ముఖులం కావాలి.

**"త్ర్యంబకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్ ।**
**ఉర్వారుక మివ బన్ధనాన్ మృత్యో ర్ముక్షీయ**
**మా అమృతాత్ ॥** (ఋగ్వేదం 7-59-12)

హే త్ర్యంబకేశ్వర ! ఈ త్రివిధ లోకాలలోనూ, నా ఈ త్రివిధ శరీరాలలోనూ వ్యాపించియున్న పరమేశ్వర ! నేను నిన్ను పూజించుచున్నాను. ప్రార్థించుచున్నాను. సుగంధితము పుష్టివర్ధకమునైన పండిన దోసపండు తీగనుండి సునాయాసంగా విడిపోవునట్లు నన్ను ఈ మృత్యురూప సంసారసాగరంనుండి విడిపించి నీ తృతీయధామానికి తీసుకువెళ్ళు. మా అమృతాత్ = నీ అమృతత్వాన్నుండి - ముక్తి ధామాన్నుండి విడిపించవద్దు. మరల ఈ సంసార సాగరంలోనికి పంపవద్దు." అని ప్రార్థిస్తూ పాము కుబుసాన్ని విడిచినంత అనాయాసంగా శరీరాన్ని వదలిపెట్టి వెళ్ళాలి. అస్తు (మనమందరము అట్లే చేయుదుముగాక.)

**ఓ3మ్ శాంతి శ్శాంతి శ్శాంతి ః**